# మహాభారత మీమాంస

రావుబహదూర్ చింతామణీ వైద్య ఎం. ఏ. ఎల్. ఎల్. బి. గారు వ్రాసిన ఉపసంహారము మరాఠీ గ్రంథమునకు హిందీలో పండిత మాధవ రావు సప్రేగారి అనువాదమగు మహాభారత మీమాంసకు అనువాదము.

అయిదవ భాగము

## భగవద్గీతా విచారము




రచయిత

**చర్ల నారాయణశాస్త్రి**



ప్రకాశకుడు

**చర్ల గణపతిశాస్త్రి**

వెల : రూ॥ 6-00

1985

మొదటి ముద్రణము

ప్రతులు : 500

లలిత ఆర్టుప్రెస్
టౌన్‌హాల్ రోడ్డు,
విశాఖపట్నం-1

దొరకు చోటు

చర్ల గణపతిశాస్త్రి
33 కిర్లంపూడి లేఔటు
వాల్తేరు-3

# — మనవి —

ఈ మహాభారత మీమాంసను మా తండ్రి కీ. శే. చర్ల నారాయణ శాస్త్రిగారు నలభై సంవత్సరముల క్రిందటనే అనువదించినారు. ఇంత గొప్ప దానిని ప్రచురించుట నావంటి సామాన్యునికి శక్యము కాని పని. దీని ప్రచురణకై మా తండ్రిగారి యభిమానులను, ఆప్తులను వారు ధనికులు అను నుద్దేశముతో సాయముచేయ గోరియుంటిని. కాని వారు దీని ప్రచురణకై సాయపడలేదు. ఇది అయిదు భాగములలో పూర్తి యయినది. నేనే దీని భారమును వహించి స్వంతముగా లలితా ఆర్టు ప్రెస్ పెట్టి దీనిని ఎట్లో నేటికి పూర్తిచేసి పితౄణము తీర్చికొన గలిగితిని గదా అని సంతోషించితిని. ఇదే కాకుండ మన భారతీయ విజ్ఞాన సముద్రమును స్వావలంబనగా ఈ చిన్న నిర్ధనిక జీవిత నావతో దాటుచున్నాను. దీనికి భగవంతుడును ప్రెస్సుకు మూలమగు లలితా దేవియు ఆధారము. ఇందుకై ఆ భగవంతుడైన నారాయణునికిని, ఆ లలితా దేవికిని కృతజ్ఞతాభివందనము లాచరించుచు దీనిని ఆదరింప ఆంధ్ర సోదరులను గోరుచున్నాను.

ఇట్లు
బుధ విధేయుడు
చర్ల గణపతి శాస్త్రి

ఆర్షవిజ్ఞాన పరిషత్తు
36 కిర్లంపూడి లేఔటు
వాల్తేరు - 3

విషయసూచిక పుట

# మహాభారత మీమాంస

## పదునెనిమిదవ ప్రకరణము

## భగవద్గీతా విచారము

సమస్త ప్రాచీన సంస్కృత సాహిత్యమందును మహాభారత మత్యంతము శ్రేష్ఠమైనట్లే మహాభారతమందలి యన్ని యాఖ్యానముల యందును నుపాఖ్యానములయందును భగవద్గీత శ్రేష్ఠమైయుండెను. మహాభారతమందే చాలాస్థలములలో భగవద్గీతయొక్క ప్రశంసయుండెను. భగవద్గీత యుపనిషత్తుల్యముగా మన్నింపఁబడుచుండెను. మఱియుఁ బ్రాచీనులు నర్వాచీనులు, ప్రాచ్యులు పాశ్చాత్యులునైన తత్వజ్ఞానులందఱును దానినాదరించుచుండిరి. కావున మహాభారతముయొక్క మీమాంసయందు భగవద్గీతవిషయమయి స్వతంత్రమును విస్తృతముసయినరీతిని విమర్శనము చేయుట యత్యంతావశ్యకమయి యుండెను. నిస్సందేహముగా నిట్టివిమర్శనములేని యెడల నీగ్రంథమసంపూర్ణమై కాఁగలదు. కనుక నీప్రకరణములో భిన్నభిన్న దృక్పథములతో భగవద్గీతకుసంబంధించిన విచారమును గావించుటకై మనము నిశ్చయించుకొంటిమి. భగవద్గీతవిషయమై యిప్పటిలోఁ జేయఁబడు ననేక శంకలకుఁగూడ శక్తికొలఁదిని సమాధానమీయఁబడును.

### భగవద్గీత సౌతికృతము కాదు.

భగవద్గీత విషయమై, ఈ గ్రంథమొక కర్తదియే యగునా? లేక మహాభారతమందువలెనే యిద్దరు ముగ్గురు కర్తలయొక్క రచన యగపడుచున్నదా? యనునది మొదట ప్రశ్నమైయుండెను. మనయభిప్రాయమున భగవద్గీతా గ్రంథము మొదటినుండి చివరవఱకు, ఒక్క దివ్యకల్పనాశక్తిచేతనే నిర్మింపఁబడినదియు నయ్యది యెన్ని విధముల సర్వాంగసుందరమును బద్ధమునయి యుండెను. మనము మహాభారతమునకు ముగ్గురుకర్తలను నిశ్చయించి యుంటిమి:- వ్యాసుఁడు, వైశంపాయనుఁడు, సౌతి. భగవద్గీతాగ్రంథము సౌతికృతముకాదని మనము నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁగలుగుచుంటిము. సౌతి తాను దనచేత విస్తరింపఁబడిన మహాభారతమందు భగవద్గీతలోని యెన్ని

వచనములను మాటిమాటికి నెత్తియుండెనో యిచటఁ జెప్పవలసిన యావశ్యకతలేదు. ఈవచనములు పాఠకులధ్యానమునకు శీఘ్రముగనే రాఁగలవు. మహాభారతకారుని మనస్సున భగవద్గీతవిషయమైయున్న యాదరమావచనములఁబట్టి యగపడుచుండెను. మహాభారతమును నిర్మించునపుడు సౌతి యెదుట నిప్పటి సంపూర్ణ భగవద్గీతయుండెనని స్పష్టముగాఁ దెలియుచుండెను. ఈ విషయమై యొకటి రెండు ప్రమాణాంతరములఁగూడ నీయంగలము. సౌతి మూలభారతమునందలి యనేకములయిన యుత్తమభాగముల ననుకరించి విస్తృత మహాభారతమును నిర్మించియుండెనని మనముమునుపు వ్రాసియుంటిమి భగవద్గీతనే యనుకరించి యతఁడశ్వమేధ పర్వమందు గీతకు స్థానమునిచ్చియున్నాఁడు మఱియు దానికి నామమునుగూడఁ అను గీత, అని పెట్టియుండెను. అనఁగా నయ్యది భగవద్గీతయొక్క యనుకరణముమీఁదఁ దరువాతను జేయఁబడియుండెను. సారాంశము, భగవద్గీత సౌతి యెదుట నత్యుత్తమాదర్శము మాత్రమేకాదు, ఇంకనేమంటేని యతఁడు భగవద్గీతయొక్క స్తుతిని శ్రీకృష్ణునిముఖమునుండియే యీ యనుగీతయొక్క ప్రసంగమందుఁ జేయించియుండెను. యుద్ధానంతరమున నర్జునుఁడు శ్రీకృష్ణుని "యుద్ధారంభమున నీవునాకుపదేశించిన దివ్యజ్ఞానము నశించిపోయినది యది మరలనుపదేశించుము." అని యడిగినపుడు శ్రీకృష్ణుఁడీ యుత్తరము నిచ్చియుండెను:—

> పరంహి బ్రహ్మ కథితం యోగయుక్తేన చేతసా।
> న శక్యం తన్మయా భూయస్తథా వక్తుమశేషతః॥
> స హి ధర్మస్సుపర్యాప్తో బ్రహ్మణః పరివేదనే।
> న చ సాద్య పునర్భూయః స్మృతిర్మే సంభవిష్యతి॥ (అశ్వ.అ. 6)

"నేనాభగవద్గీతను మరలఁ జెప్పఁజాలను." శ్రీకృష్ణుని యీ వాక్యమందు భగవద్గీతయొక్క స్తుతియెంతయుండెనో తెలియదు!!! సౌతి తన పనినే తానెన్నడును గొనియాడి కొనియుండఁడు. మఱియొకరు రచించిన భగవద్గీతాగ్రంథము సౌతి సమ్ముఖనముండెననియు దానియెడ నాతనిమనం

బున నెంతయు నాదరముకూడ నుండెననియు స్పష్టముగా నగపడుచుండెను. భగవద్గీతననుకరించి యతఁడనుదితోపాఖ్యానముపకు మహాభారతమందు స్థానమొసఁగెనని మనము చెప్పఁగలుగుచున్నారము.

ఇదిగాక యనుకరించెననుటకు మరియొక ప్రమాణముగూడ మనకగపడుచుండెను. మహాకవియొక్క యత్యుదాత్తకౌశల్యమున కనురూపముగా వ్యాసుఁడు అథవా వైశంపాయనుఁడు విశ్వరూప దర్శన చమత్కారమును భగవద్గీతయొక్క మధ్యభాగమునందుఁ గూర్చియుండెను. ఈచమత్కారమీస్థానమందు మిక్కిలి మార్మికమైన రీతిని వచ్చియుండెను. దానికిచట నుపయోగము కూడనయియుండెను. అర్జునుని హృదయమందు శ్రీకృష్ణుని యొక్క దివ్యోపదేశతత్త్వమును బూర్ణముగా నాటుటకయి దానియొక్క యుపయోగముండెను; అదికూడ జరిగెను. ధర్మసంస్థాపనార్థము చమత్కారము యొక్క యునికి యన్నిధర్మములయందు మన్నింపఁబడియుండెను. దీని ననుసరించి మనమహాకవి యీచమత్కారముయొక్కయోజనము భగవద్గీతలో నుచితస్థానమున యోగ్యకారణముచేతఁ గావించియుండెను. కాని సౌతి ఈ చమత్కారముయొక్క యవలంబము ననుకరణముచేత మఱియొకచోటఁ జేసియుండెను. అది యయోగ్యస్థానమందు నయ్యెను దానికి నుపయోగము కూడ నేమాత్రము లేదయ్యెను. ఉద్యోగపర్వముయొక్క 130.వ యధ్యాయమందు, శ్రీకృష్ణుఁడుకౌరవులసభకు దూత్యమును లేక మాధ్యస్థ్యమును జేయుటకయి వెడలినపుడాతఁడు తనవిశ్వరూపమును ధృతరాష్ట్రునికిఁ జూపెనని వర్ణనమున్నది. అదినిజముగా భగవద్గీతయందీయఁబడిన విశ్వరూపదర్శనమున కనుకరణమై యుండెను. ఇంతియేకాక యర్జునునికి శ్రీకృష్ణుఁడు విశ్వరూపదర్శనముకొఱకు దివ్యదృష్టినిచ్చియున్నట్లే యిచట ధృతరాష్ట్రునికిఁ గూడ దివ్యదృష్టినిచ్చెనని చెప్పఁబడియుండెను. సారాంశము, భగవద్గీతయందీయఁబడిన విశ్వరూపదర్శనమునకు నుద్యోగపర్వమందీయఁబడు విశ్వరూపదర్శనమున కలదనియు నయ్యదికూడ నయోగ్య స్థానమందున్నదనియుఁ బాఠకులకుఁ దెలియకుండ నుండఁజాలదు. కనఁగా భగవద్గీత యిపుడున్న

రీతినే సౌతియెదుట నుపస్థితమైయుండెననియు, దానియందలి యాదరము చేత ననుకరణమార్గమున నీభాగము ద్యోగపర్వమందుఁ బ్రవేశపెట్టఁబడి యుం డెననియు మనయీయనుమానము దృఢపడుచుండెను.

సౌతినమ్ముఖమునున్న భగవద్గీతన్నది యున్నట్లుగనే యతఁడు మహాభారతమందుఁ గలిపివైచెనా లేక యందతఁడేమైన మరికొంత చేర్చెనా యను నీప్రశ్న కూడ నిచ్చట నుపస్థితమగుచుండెను. విశ్వరూపదర్శనము నకుఁ బిమ్మట యధ్యాయములుకొన్ని సౌతిచేత జోడింపఁబడినవియేయని చాలమంది యభిప్రాయమై యున్నది. భగవద్గీతయొక్క నడుమనున్న యధ్యాయములు తరువాత జోడింపఁబడినవని మొదటివియుఁ జివరివియు మూలభూతములై యున్నవనియే హాపకిన్సుయొక్క మతముకూడ నయినట్లు గపడుచున్నది. మొదటి యధ్యాయములు రెండును దరువాతఁ జేర్పఁబడి యుండెనని రాజారామశాస్త్రి భాగవతుఁడు నయితము ప్రతిపాదించియుండెను విభూత్యధ్యాయమందును 15వ యధ్యాయమందును గొన్ని పచనములకుఁ బూర్వాపరసందర్భము లేక మైత్రి గుదరకున్నది. కాని మనమతమున నీ యూహ పొరబాటై యున్నది. విశ్వరూప దర్శనానంతరాధ్యాయముల యందుఁ జెప్పఁబడిన సాంఖ్యవేదాంత జ్ఞానములు మహాభారతకాలముకంటెఁ బూర్వములని మనము ముందటిప్రకరణమున నుడివియున్నారము. క్షేత్రము యొక్క వివరణము భగవద్గీతయందు "ఇచ్ఛాద్వేషః సుఖం దుఃఖం సంఘా తశ్చేతనా ధృతిః" ఈయున్నివిషయములను గలిపియున్నాఁడు, కాని వీని యొక్క యుల్లేఖము మహాభారతమందు దొరకకున్నది. సాంఖ్యతత్త్వజ్ఞాన నముయొక్క యుద్ఘాటనమును సౌతి మాటిమాటికి శాంతిపర్వమందుఁ జేసి యున్నాఁడు. కాని యందు దీనియొక్క జాడయుగపడదు. ఇంకను, శాంతి పర్వమందు మాటిమాటికినిజేయఁబడిన వేదాంతజ్ఞానముయొక్క విస్తృతవర్ణన మందుఁగూడ నుల్లేఖము కొంచెమైన లేకుండెను. పదునైదవ యధ్యాయ ములోని పురుషోత్తమ యోగముకూడ మరల వర్ణింపఁబడలేదయ్యెను. దైవా సురసంపద్విభాగముకూడ మరలనెచ్చటను నగపడదు. సత్వము, రజస్సు, తపస్సు ఈత్రిగుణవర్ణనము మాటిమాటికిని వచ్చియున్నది. కాని యీదైవా సుర సంపద్విభాగము మరల నుల్లేఖింపఁబడదయ్యెను. ఈభాగములన్నియు

(గీతయందు) నెంతయుసుందరమునలౌకికముఁనయిన రీతిని విలక్షణమైన భాషయందు వర్ణింపఁబడియున్నవి:- ఉదాహరణార్థము జ్ఞానవర్ణనము, లేక "ఈశ్వరోహమహంభోగి సిద్ధోహం బలవాన్ సుఖీ" మొదలుగా నాసురస్వభావముయొక్క వర్ణనము, సౌతిచేతఁ జేయఁబడియుండునని మనము నమ్మఁజా లనియంత మనోహరములై యుండెను. శ్రీయుత భాగవతునియొక్క కల్పన మిక్కిలి పొరబాటై యుండెను. భగవద్గీతలో నెచ్చటను విరోధము లేదు; ఇంతియేకాక, విభూతివర్ణనాధ్యాయముఁకూడ నత్యంత సుందరములైన కల్పనలలో నొకభాగమైయుండెను దానియొక్క యనుకరణమును దరువాతి దయిన వేరువేరు గీతలన్నియుఁ జేసియుండెను. పదునయిదవ యధ్యాయముఁకూడఁగడు మనోహరమైయుండెను. అదియే గీతలోని యన్నియధ్యాయములయందును శ్రేష్ఠముగా మన్నింపఁబడుచుండెను. ఈరెండధ్యాయముఁల యందు శ్రీభాగవతుఁడు విరోధివచనముఁలున్నవని చెప్పియున్నాఁడు. కాని మనయాలోచనఁబట్టి నడుమవియైన యధ్యాయములను బిమ్మట సౌతి కలిపి యుండునను నీకల్పన సంభావనీయము కానేరదని తెలియును. ఆయధ్యాయముఁలలోని విషయములన్నియు సౌతినాఁటి జ్ఞానముకంటె వేరై యున్నవి వానిభాషయు విచారశైలియుఁగూడ నతిరమణీయములును దివ్యములునయి యున్నవి. సారాంశము, వానిరచన, విచారశైలి, భాషయు గీతయందలి యితరభాగములకు పిసదృశముఁలు బొత్తిగాఁ గానేరవు. ఇందుచేత ఆభాగములు భగవద్గీతయందలి మూలములనియు సౌతి యనుకరించిన విశ్వరూపదర్శనభాగముకూడ నందలిదేయనియు ననుమానము చేయఁబడఁగలదు. ఇప్రదేశయందు ఈయన్నిభాగములు సౌతి యెదుటనుండెననియు, అతఁడీ భాగముఁలను గీతయందుఁ గడపలేదనియు నమ్మవలసియున్నది.

## భగవద్గీతకుఁ గర్తయొకఁడే

భగవద్గీతయందు నేవిధమైనయసదృశ మేళనమును కాకుండెనని మనమతము * భాషాదృష్టిచేతను, గవిత్వదృష్టిచేతను విషయములయొక్క

* భగవద్గీతయందు 700 శ్లోకములున్నవి యందులోఁ పదమూడవయధ్యాయముయొక్క మొదటనొకశ్లోకము నమ్మఁబడకయున్నది. ఆశ్లోకమిట్లున్నది

దివ్యప్రతిపాదన దృష్టిచేత లేక యుక్తమచ్ఛందో రచనా దృష్టిచేతను భగవద్గీతనత్యుదాత్త కవిత్వశక్తిగల యొకమత పురుషుఁడు నిర్మించియుండెననియే యనుమానింపవలసి యున్నది. భగవద్గీత యందలి భాష మిక్కిలి ప్రభావవంతమును సరళము నాడంబరహితమును నయి యుండెను. సంస్కృతభాష ప్రత్యక్ష వ్యవహారమున వాడఁబడుచున్నపుడు అనఁగా వర్తమాన మహాభారత

---

"ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ। ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥ గీతయొక్క ప్రతులన్నిటియందు నీయేడువందల శ్లోకములె కనఁబడుచున్నవి. కాని, మహాభారతమందు గీతకు తరువాతి శ్లోకములో లెక్కింపఁబడిన సంఖ్య యెందులకసత్యము? అను నీప్రశ్నము మిక్కిలి కఠినమైయుండెను ఆపద్యము లీప్రకారముగానున్నవి:– "షట్శతాని సవింశాని శ్లోకానాం ప్రాహ కేశవః అర్జునః సప్తపంచాశత్ సప్తషష్టింతు సంజయః। ధృతరాష్ట్రః శ్లోకమేకం గీతాయా మానముచ్యతే॥" గౌడులీశ్లోకములను విశ్వసింపరని నీలకంఠుఁడు చెప్పినది చాలబాగుగానున్నది. విచారింపఁగా దాక్షిణాత్యుల పుస్తకములయందు 701 పద్యముల గీతయేయున్నది. అయినను ధృతరాష్ట్రునిదొకపద్యము అర్జునునివి 57, శ్రీకృష్ణునివి 620 మొత్తము 745 పద్యముల సంఖ్యను జెప్పిన పద్యమెక్కడనుండి వచ్చెను? కేవలము మొత్తము సంఖ్యయేకాక వేరువేరు సంఖ్యలును బొరపాటైయున్న వనుట యాశ్చర్యకరమై యుండెను. గీతయొక్క యన్నిప్రతులయందును పద్యములలెక్క యీప్రకారమున్నది:– ధృతరాష్ట్రునిది 1 శ్లోకము సంజయునివి 41, అర్జునివి 85, శ్రీకృష్ణునివి 573. ఎవరో కలిపియున్న యీప్రక్షిప్త శ్లోకమే యన్నిగడిబిడకును గారణమై యుండినట్లు తోచుచున్నది. ఈశ్లోకము సౌతిదేయైనచో నాపని యత్యంతగూఢ సంఖ్యావిషయకమైన కూటపద్యములలో నియ్యదికూడ నొకటియగునని చెప్పవలసియున్నది. ప్రస్తుతపు 700 శ్లోకముల గీతయందెచ్చటను లేక విసదృశత కనఁబడదు, కనుకఁ జెప్పఁబడ్డ పద్యమును ప్రక్షిప్తముగా నెంచి వేరుగనే చేయవలసి యుండెను. ఈపద్యము నాధారముచేసికొని కొంచెమైన ననుమానము చేయుట యుచితముకాదని మనయభిప్రాయము.

మునకుఁ బూర్వము భగవద్గీత కలదని మనము మునువు వ్రాసియుంటిమి. పాణినీయ వ్యాకరణ నియమముల ననుసరించి ఈభాషయందుఁ దప్పులు పట్టుట, కవిత్రయ భారతములోని భాషయందు బాలవ్యాకరణ, నియమముల ననుసరించి తపస్సులు పట్టుటవంటిదియై యుండెను. భాషమృతమైపోయిన తరువాతను లోనియా ప్తవ్యాకరణముయొక్క దృష్టిచేతనే గ్రంథమందైనఁ దప్పులు చెప్పఁబడఁగలవు. కాని పాణినికి మునుపటి భగవద్గీతలోని వ్యావహారిక సంస్కృతభాషయందుఁ దప్పుఁజెప్పుట నిరర్థకమైయుండెను. భగవద్గీత యందలి యనుష్టుప్ పద్యములయొక్క మాధుర్యము మిక్కిలి గొప్ప తరగతిలోనిదియై యున్నది. ఈసంగతిని హాప్కిన్సు, అనేకపద్యముల హ్రస్వ దీర్ఘానుక్రమమును విచారించి మహాభారతములోని యితరేతర భాగముల యనుష్టుప్పులతో బోల్చిచూపియుండెను. భగవద్గీతలోనే యొకయధ్యాయమందును భాషయొక్క సౌందర్యము లేక ఛందస్సులయొక్క మాధుర్యము న్యూనాధికమైనట్లు కనఁబడదు. ఈవిధముగనే విషయ ప్రతిపాదనములో నెచ్చటను విరోధముగూడఁ గన్పింపదు. వేరువేరు విషయములన్నియు నొకవిధమేయైన దివ్యకల్పనా శక్తిచేత పర్ధింపఁబడియుండెను. మరియు నందు మహాతత్వజ్ఞానాత్మకమైన గంభీరవిచారము ప్రౌఢముఁ బసన్నమునైన వాణిచేతఁ జేయఁబడియున్నది. కావున భగవద్గీతా గ్రంథమంతయు బుద్ధిశాలియైన యొకకవి యొక్కయే ప్రతిభాసంపన్నమైన మస్తిష్కముచేసిన సృష్టి యని సిద్ధించుచుండెను; మరియు నయ్యది నిరుపమానమైనతాజమహాలు భవనమువలె సుందరము సుబద్ధము విశేషములయిన కల్పనతో నింపినదై మనయెదుట నుపస్థితమగుచున్నది. దానియందెచ్చను నతుకులు కనిపింపదు. కలుపుడునులేదు. తరువాతఁ గలిపిన భాగమేదియు నగపడదు. దాని యొక్క సంపూర్ణమయిన శుభకారములేక చిన్నచిన్న మనోహరభాగములు ఒకటిప్రతినవలన నుత్పన్నములై యుండెను. నయోత్స్య ఇతి గోవింద ముక్త్వాతూష్ణీం బభూవహ" ఇది దానికిఁ బునాదియైయుండెను; విశ్వరూప దర్శనము దానిమధ్యభాగము; కరిష్యేవచనం తవ" దానిశిఖరమైయున్నది. సాంఖ్యము, యోగము, వేదాంతము, భక్తి యనునెడి నాల్గుతత్వజ్ఞానములను నాలుగుకోణములయందు నాలుగుస్తంభములయి యున్నవి. కర్మయోగము

దానికిమధ్యముగానున్న ప్రధానస్తంభము. ఇట్టిభవనమునకు నడుమను పర బ్రహ్మము కలదు. ఈవిధముగా ఈదివ్యతత్వజ్ఞానాత్మకమైన గ్రంథముయొక్క యలౌకిక సౌందర్యము మనలనందఱను విస్మితులను గావించుచుండెను. సారాంశము. ఈసర్వోత్కృష్టమైన గీతయందు నెచ్చటను ననురూపమయిన సాంకర్యము కనఁబడదు. అందలి యుదాత్తకల్పనకు శోభాధాయకముకాని దిగాని దానిలోఁ గలియకుండునదిగాని యభిప్రాయమొకటియుఁ గనరాదు. ఏయొకచోటనయినను గల్పనలోనయినను సౌందర్యముగాని గాంభీర్యము గాని కొంచెముఁకూట దగ్గియున్నదని చెప్పఁజాలము. తుదకీగ్రంథము ఒక మహాబుద్ధిశాలియైన కవీశ్వరునిదని చెప్పకుండ నుండఁజాలము.

## భగవద్గీత మూలభారతములోనిదే

భగవద్గీతయంతయుఁ దత్త్వజ్ఞాన విషయకమై యుండుటచేతను మొదట దీనికి మహాభారతకథతోఁ గొంచెమును సంబంధములేదిడి యుంటగు; కాఁబట్టి దానినొక యుత్తమగ్రంథముగాఁ దలఁచి సౌతి తన మహాభా మందు నితరాఖ్యానములతోడిపాటుగాఁ గలిపియుండునని యెందులకు విశ్వ సింపఁగూడదను శంక యిపుడు గలుగుచుండెను. భగవద్గీత మూలభారతము లోని యితిహాసముతో సంబంధించినది కాదు. శ్రీకృష్ణుఁడు దానిని జెప్పి యుండనేలేదు. దానిని బూజ్యుఁడయిన నామక, గురువు చెప్పియు డెనుసౌతియొక్క యుద్దేశము అన్నితత్త్వజ్ఞాన విషయక గ్రంథము నాఖ్యానములను నొకచోఁ జేర్చుటయై యుండుటచేత దనయుద్దేశమున రించి భగవద్గీతను మహాభారతమునఁ గలిపివైచెనని యెందుకుఁ జెప్పఁగూ దని కొందరనుచున్నారు. భగవద్గీత మూలభారతములోని యొకభాగము నెట్లు విశ్వసింపఁగలమని దీనితాత్పర్యము. మనమతముఁబట్టి యీకల్పన కాలమైనవి నిలువఁజాలదు. వాస్తవమును భగవద్గీతయొక్క క కృష్ణార్జునులదితక్క నితరులది కాఁజాలదు. భగవద్గీతలోని ఉపదేశ యొక్క యారంభము ఏఉత్తమపద్యముతోనై యున్నదో అపద్యముగీ లేనియెడల దానిని గీతయని ఎవరుచెప్పుదురు.

అశోచ్యానన్వ శోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతా సూనగతా సూంశ్చ నానుశోచంతి పండితాః॥

ఈయుదాత్త పద్యముతోడనే యుపదేశముయొక్క యారంభము యుక్తమైన రీతిగానయి యుండెను. దీనికి సంబంధము భారతీయ యుద్ధముతోడనే కలదు. భగవద్గీతయందు, యుద్ధముకూడదా? యనునీచర్చయే మాటిమాటికిని జేయఁబడియున్నది. మఱియును "యుధ్యస్వ విగతజ్వరః మామనుస్మర యుధ్యచ" ఇదిమొదలుగా నుపదేశముకూడఁ జాలపర్యాయములు చేయఁబడియుండెను; విశ్వరూప దర్శనమందు సైతము సమస్త భారత యుద్ధముయొక్కయే కల్పనచూడఁబడుచున్నది; విశ్వరూపముయొక్క భయంకరమైన యుద్ధమునందు భీష్ముఁడు, ద్రోణుఁడు మొదలైన చాలమంది వీరులు ప్రవేశించుచున్నట్లు ఈదృశ్యము చూపఁబడియుండెను. అనఁగా ఈభగవద్గీతలో విశ్వరూపదర్శనము కలదు. దానికి సంబంధము భారత యుద్ధముతోఁ దప్పకయుండి తీరవలయును. అదిసౌతియొక్క మహాభారతములోని భాగము కానేరదు; అనఁగా సౌతి భగవద్గీతకు వర్తమానరూపము నిచ్చియుండలేదు, ఇఁకనేమంటేని ఈరూపమతనియెదుర నంతకముందే పూర్ణముగా నుపస్థితమై యుండెనని మనము నిశ్చయించి యుంటిమి. భారతీయయుద్ధకథతో సంబంధించినరూపమునెవరోమఱియొకవ్యక్తి పూర్వమే యిచ్చియుండునను కల్పన చేయుటలో లాభమేమున్నది? గీత వ్యాసుల యొక్క లేక వైశంపాయనియొక్క మూలభారతములోని భాగమేయై యున్నదని చెప్పఁబడఁగలదు. భగవద్గీతయందు శ్రీకృష్ణుని మతముతే యుద్ఘాటింపఁబడినవనుటలో నెట్టి సందేహమును లేదు. శ్రీకృష్ణార్జునుల యితిహాసము ప్రధానరూపమున నీయఁబడియున్న భారతగ్రంథమందు శ్రీకృష్ణునితత్వజ్ఞానముయొక్క చర్చకొంచమయిన నుండుట నిజముగా నావశ్యకము స్వాభావికమును గూడనయియుండెను. ఈదృష్టితోఁ జాచినమీఁదట శ్రీకృష్ణుని తత్త్వోపదేశమును వికచించునట్టి భగవద్గీత భారతముయొక్క భాగమే యైయుండుటలో నాశ్చర్యమేమియునులేదు. నరనారాయణుల విజయవర్ణనముతోఁ గూడియున్న మూలభారతమందే వారిసంవాదరూపమున శ్రీకృష్ణునితత్వజ్ఞానముయొక్క యుద్ఘాటనము నుండి తీరవలయును. వేయేల

ఈవిషయము మహాకవియొక్క యత్యంతోదాత్తమయిన కావ్యకళకు ననురూపమైయుండెను. సాధారణముగా భగవద్గీత యార్షమై భారతమహాకావ్యము యొక్క భాగముగుటయే సంభవమై యుండెను; అంతేకాక, భగవద్గీత మతి యొక రూపముననుండుట యసంభవము. భగవద్గీతయందు వర్ణితమైయున్న తత్త్వము పూర్వమందొకపుడు వేరుశబ్దములతో లేక వేరురూపముతోనున్నదనియు దానిని వ్యాసుఁడు లేక వైశంపాయనుఁ తనశబ్దములలో వర్తమాన రూపముతో భారతగ్రంథమునకుఁ గూర్పికొని వచ్చెననియు విశ్వసింతుమను టలో స్వారస్యము కొంచెమైనను గానిపింపదు. కారణమేమనఁగా భగవద్గీతయొక్క వర్తమానరూపము వర్తమానశబ్దములును మిగుల మహత్త్వము కలవై యున్నవి. ఈసంగతినెవఁడును సమ్మతింపకపోఁడు. కనుక భగవద్గీత యొకప్పుడు మిక్కిలివేఱయిన మూలస్వరూపముతో నుండియుండును ను కల్పనలో నర్థమేమియు నగుపడదు.

రణభూమియందు గీతచెప్పఁబడుట యసంభవముకాదు.

ఈప్రకారముగా విస్తృతమైన సంభాషణము నిజముగా యుద్ధపమ్మయమున చెప్పఁబడెనా యని కొందఱప్పుడప్పుడు ప్రశ్నించుటయుఁ గలదు. ప్రాచీనభారతీయార్య పరిస్థితిని విచారించినచో నీ సంవాద మసంభవము కాదని మనము తెలిసికొనవచ్చును. అతిప్రసంగమేల, ప్రత్యక్షమైన వస్తుస్థితి యిట్లుండుట సంభవము. భారతీయయుద్ధమందు రెండువయిపుల నొకరికొకరెదురుగా నిలఁబడియున్న సేనల విషయమై మనస్సులో నుచితమైన కల్పనము గావింతుమేని రెండుసేనలకును మధ్యభాగమున శ్రీకృష్ణుఁడు నర్జునుఁడును రథముపైఁ గూర్చుండి, యుద్ధముచేయుట యుచితమా లేక యనుచితమా యని విచారము చేయుచుండిరన్న సంగతి యేవిధముననఁ జూచినను నసంభవముగాఁ గన్పడదు. ఉభయసైన్యములందును 52 లక్షలకుఁ దక్కువకాని మనుష్యులుండిరని చెప్పఁబడియున్నది. ఈసేనలు విశాలమైన యుద్ధభూమియందుఁ గొన్నికోసులవరకు వ్యాపించి యుండును. ఇరుసేనలు నొకదానికొకటి అంకెత్రిసు లేక పావుక్రోసు ఎడముగా నిలుచుండి యుండును. ఆకాలమున ధర్మయుద్ధముయొక్క నీతి ప్రచలితమై యుం

డెను, కనుక నెవఁడును ఏవనిమీఁదను జాగరూకత లేని యవస్థయందు శస్త్రమును బ్రయోగింపఁగలుగుటసంభవముకానేరదు. అర్జునుని రథముకొంచెము ముందుకుఁబోయి మధ్యభాగమున రెండుసేనలును గనఁబడునట్టిచోట నిలఁబడె నన్న విషయముపై యాశ్చర్యపడవలసినది కొంచెమైనను లేదు. శ్రీకృష్ణునికి నర్జునునికిని సంభాషణమొకగంట లేక గంటయుంబావుకంటె నెక్కువసేపు దాఁకనయి యుండదు. అంతకంటె నెక్కువసేపు పట్టదనుసంగతి వర్తమాన కాలమున గీతను ఆతిశ్రీ ... బతిదినము పఠించుచున్నవారి కనుభవసిద్ధమై యున్నది. రెండుదళముల సేనానాయకులకు వారిసంభాషణయొక్క ముగింపు కుఁ గనుపెట్టికొని యుందురనియు ననుకొనకొనవలసిన అవశ్యకత యుండదు; ఎందుచేతనన్నఁగా అంత పెద్దసేనల సేర్పాటుచేయుట యొకటి రెండు నిముషములపని కాదు ఇది యిట్లుండె, ఐతిహాసికయుద్ధవర్ణనముఁ బట్టి సేనాపతులు తమతమ దళములను బన్నునప్పుడు ఒకఁడు రెండవదానిదళమును మిగులసూక్ష్మముగా నిరీక్షించుటకుఁ గొన్ని ఘంటలు వినియోగించుచుందురని సైతము తెలియుచున్నది శ్రీకృష్ణునియొక్క నర్జునునియొక్కసంలాపము నితరయోధులకు వినఁబడకుండెను. అన్నఁగా యోధులధ్యానము వారిపై పు లేకుండెనని చెప్పవలసియుండెను. వారు తమదళమును బన్నుకొనుటకుఁ జూచుకొనుచుండిరనియు విశ్వసింపఁబడుట స్వాభావికమై యున్నది. సైన్యాంశము, యుద్ధభూమియొక్కవిస్తృతి, తమతమ దళములఁబన్నుకొనుట దానియొక్క నిరీక్షణముధర్మయుద్ధముయొక్క నియమములు ఆవిమొదలగు విషయములను విచారింపఁగా భారతీయ యుద్ధముయొక్క మొదటినాఁడు, యుద్ధమునకు ముందుగనే, శ్రీకృష్ణుఁడునర్జునుఁడును తత్త్వజ్ఞాన విషయిక మైన చర్చయందు ఘంటయో సపాదఘంటయో కడపియుండుట కొంచెమైన నసంభవవిషయము కాదనియే సిద్ధించుచున్నది.

## భగవద్గీత యప్రస్తుతముకాదు.

మంచిది; ఇంతవిస్తృతమైన సంభాషణము యుద్ధభూమియందు జరగుట సంభవమైయుండెనని విశ్వసింపఁబడుగాక; అయినను కొందరులోకులు అయ్యది యప్రాసంగికమని చెప్పుట కలదు. కొందరు కల్పనాంతరఁగములు

భగవద్గీత మహాభారతమందుఁ బ్రక్షిప్తమైయున్నదను నంతవఱకుఁ వ్యాపించి ఉన్నవి. కాని యీ యాక్షేపముకూడ నిరర్థకము. భగవద్గీత ప్రక్షిప్తమైనట్లు కానిపింపదు. ఈ గ్రంథమందు ముందువెనుకల నెచ్చటనుగానిపింపదు భగవద్గీతకుఁ బూర్వము మహాభారతముయొక్క తుది శ్లోకమిట్లున్నది:-

ఉభయోః సేనయోరాజన్ మహాన్ వ్యతికరోఽభవత్।
అన్యోన్యం వీక్షమాణానాం యోధానాం భరతర్షభ॥

మఱియు గీతకుఁ బిమ్మట యధ్యాయముయొక్క మొదటి శ్లోకమిట్లున్నది:-

తతో ధనంజయం దృష్ట్వా బాణగాండీవ ధారణమ్।
పునరేవ మహానాదం వ్యసృజంత మహారథాః॥

భగవద్గీతలో మొదటియధ్యాయమందే శ్రీకృష్ణుఁడు నర్జునుఁడును రథమునఁ గూర్చుండి సేనలకు నడిమైదానముయొక్క మధ్యభాగమునకుఁ బోయి నిలఁబడిరని చెప్పబడియున్నది. దీనితరువాత, సంభాషణము పూర్తి కాఁగానే వారు పాండవులసేనకుఁ దిరుగావచ్చిరి; అపుడు సైన్యమంతయు సింహనాదముఁ గావించెను. (ఈవర్ణనము గీతకుఁ దరువాతి యధ్యాయములోని పై చెప్పఁబడిన శ్లోకము వలనఁదెలియుచున్నది.) ఇట్టిస్థితిలో నిచ్చట సందర్భమేమియు నగపడదు. భగవద్గీత యిక్కడనుండి విడఁదీయఁబడినను హానియేమియులేదని కొందఱు లోకులు చెప్పుచున్నారు. కాని యీకథనము ప్రతియుపాఖ్యానమునకును జెల్లఁగలదు. సారాంశము, ఈయాక్షేపములోఁ గొంచెమేని స్వారస్యము లేకున్నది. అవును, భగవద్గీతయనఁగా అందుఁ బ్రతిపాదితమైన వాదవివాదము ప్రాసంగికమా లేక కాదా యను ప్రశ్నమాత్రము మహత్త్వముఁ గలదియు విచారణీయమునయి ఉన్నది. వాసుదేవుఁడీతత్త్వజ్ఞానమునకుఁ మిక్కిలి విచాతుర్యముతో యుద్ధప్రారంభమునందే స్థానమిచ్చినాఁడని మనము తలంచుచున్నాము. లక్షలకొలఁది మనుష్యులుచచ్చుటకును జంపుటకును సిద్ధపడియున్నపుడు ధార్మికహృదయముగల మనుష్యునికి నిజముగా నొకవిధమైన మోహము జనించుట సంభవమైయున్నది. అ దానికి నేనుజేయుచున్నది యుచితమా కాక యనుచితమా

యని సందేహము కలుగుట ఆశ్చర్యముకానేరదు. మనయభిప్రాయమందు భగవద్గీతయొక్క ప్రారంభమున గీతలోని యర్జున విషాదయోగమునకు సింహాసమయ్యెబడియుండుట నిజముగా మిగుల మార్మికమైయున్నది. ఈ చిన్నరాజ్యమునకు సంబంధించిన యెండొరుల తుచ్ఛకలహమును దీర్చుటకు గాను భీష్మునివంటి పితామహుని ద్రోణునంతటి గురువుని శల్యాదులవంటి బంధువులను జంపుదునా? మా పుత్రపౌత్రులను జంపుదునా? యనునీప్రశ్నమే విధముగా బంధుప్రేమనుదియో, యట్లే రాజ్యసంబంధియగు మహత్త్వమది కూడనయియున్నది, ఇంగ్లీషులో దేనిని 'సివిల్‌వార్' అని చెప్పుచున్నారో యది తమలోఁదమ గొంతుకలను దెగఁగోసికొనెడి యుద్ధమేయైయున్నదను మాట నిశ్చితము. ఇట్టియుద్ధమున స్వజనవినాశమే యగుచున్నది. కాఁబట్టి ధర్మశీలుఁడని చెప్పఁబడు నర్జునునికి మనస్సున నీవిచారములవలన మోహముజనించుట యత్యంత సహజమైయున్నది. లోభియు మూర్ఖుఁడు నయిన దుర్యోధనుని ధ్యానములోని కివిషయమురాకుండుట లోపమనిపించు కొనదు. కాని మనము దీనిని జక్కఁగా నాలోచింపవలయునని మనకుండవలయును, ఎందుచేతననఁగా మనము ధర్మశీలులమైయున్నాము. ఈప్రశ్నమొకయర్జునునికే కాదు; ఇఁకనేమంటేని సమస్తభారతీయ యుద్ధము యొక్కయు ధార్మికతా విషయమై యొకవాదగ్రస్తమగు ప్రశ్నముపస్థితమగుచున్నది. మరియు, ఇట్టియవసరమునఁ దత్త్వజ్ఞానవిషయమైనచర్చకు మహత్త్వముకూడ గలదనుట నిర్వివాదము మనుష్యునియొక్క జీవితమందు నీతికర్తవ్యతలో గూఢమైన సిద్ధాంతమును వివేచించుటకు దగినస్థానమిదే యనుమాట నందరు నొప్పుకొనఁగలరు. కర్తవ్యము అకర్తవ్యము, నీతి దుర్నీతి, పాపము పుణ్యము, మొదలుగా విషయుల సిద్ధాంతములను బ్రతిపాదించుటకై యిదే యవసరము మఱియు నిదేస్థానముచితమనుటకు సందేహ లేదు. వ్యాసులే ప్రసంగమునకై భగవద్గీతను వర్ణించిరో యది ఈయుదాత్తమైన గ్రంథములోని తత్త్వజ్ఞానమునకు ననురూపమైన యుదాత్తమే యైయున్నది.

సంపూర్ణభారతగ్రంథమునఁ బ్రతిపాదితమైయున్న కొంతవిషయమును సమర్థించుటకై ముఖ్యమైన స్థానము ఈభయంకరయుద్ధముయొక్క ఆరంభ

మేమైయున్నది, ఇదేఆలోచించి సరిగా యుద్ధారంభమునందుఁ బరమోచ్చ
మైన యీతత్త్వజ్ఞానమునకు వ్యాసమహర్షి స్థానమిచ్చియున్నాఁడు. ఉత్తమ
మైన ధ్యేయముయొక్క యెదుట మనుష్యుని శరీరమునకు మహత్త్వమనఁగా
నెట్టిది? శరీరము నశించిపోయినప్పటికిఁ దిరుగామాటి మాటికిని లభించునదే
యైయున్నది; కాని ఆత్మయు ధర్మమును తత్త్వమునయియున్నది. ఉన్న
మైన యీధర్మతత్త్వముయొక్క ప్రశ్నమువచ్చినపుడు ప్రాణహానియొక్క
ప్రశ్నము తుచ్ఛమైయున్నది. "ధర్మోనిత్యః సుఖదుఃఖేత్వనిత్యే జీవో
నిత్యస్తస్య హేతుస్త్వనిత్యః॥ ఈవాక్యమందు వ్యాసమహర్షి ధర్మతత్త్వము
స్థిరము నిత్యమునని చెప్పియున్నాఁడు ఈధర్మతత్త్వముల ముందు సుఖ
దుఃఖ విచారణమే యుచితముకానేరదు; ఎందుచేతననఁగా జీవనము లేక
ఆత్మ నిత్యము నమరమునయి యున్నది. దానికిహేతువయిన కర్మకృత
శరీరమేది కలదో యుని యనిత్యము తుచ్ఛమునయి యున్నది. సాధారణము
మనుష్యుఁడు తాను సంసారమునఁ బరమోచ్చమైన ధర్మమువయిపును నీతి
తత్త్వముల వైపును ధ్యానింపవలయును-వానియొక్క ధ్యానము మనుష్య
హానివయిపు లేక ప్రాణహానివయిపుగా నుండఁగూడదు. సర్వకర్మములను
బరమేశ్వరునికర్పించి ధర్మతత్త్వముల రక్షింపవలయును. ఇందువలన
"హత్వాపి స ఇమాన్ లోకాన్న హంతి న నిహన్యతే" చంపుట లేక చచ్చుట
యనెడి రెండుపనులు సమానములగుటయును లాభముచేకూరును. ఉచ్చము
అయిన ధర్మతత్త్వముందర నీజీవులయెడ లేక మృతులయెడ శోకమువ్యర్థము
ఇటువంటి మహాతత్త్వజ్ఞానముపదేశించుటకుఁ బ్రసంగము భారతీయ యుద్ధా
రంభమే. అట్టిస్థితిలో అలౌకికమును శాశ్వతతత్త్వజ్ఞానము నుపదేశించునట్టియు
నగుగ్రంథమునకు వ్యాసమహర్షి యుయోగ్యస్థానమునిచ్చెనని యెవరనఁగలరు.
వ్యాసమహర్షి భగవద్గీతాఖ్యానమునకిచ్చుట స్థానమిచ్చుటనుబట్టి చూడఁగా
మహాకవి కర్హమైన యుదాత్త కళకు దిగ్దర్శనమగుచున్నది, ఇంతియేకాక,
మహాకవి యీ యాఖ్యానమును దనభారతగ్రంథమునకు సర్వస్వముగానెంచి
యిందలి తత్త్వజ్ఞానములోని యన్నివిషయములను సంక్షిప్తములును గంభీర
ములునయిన శబ్దములయందు సమకూర్చియున్నాఁడు, మఱియు, ఈగ్రంథ

మత్యంత ధార్మికగ్రంథములలో నధ్యయనము చేయఁదగిన యొకభాగమని కూడనందు సూచించియున్నాఁడు. అంతమున శ్రీకృష్ణుని ముఖమునుంటియే యిట్లు చెప్పియున్నాఁడు—

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యసంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్స్యామితి మే మతిః॥

సారాంశము, సంవాదరూపమైన యీ గ్రంథము నధ్యయనముచేయుట యెంతయు లాభదాయకమైయున్నది. ఇలదు పర్ణితమైన విషయము సాంసారికబుద్ధి ఉత్తితమెట్లో దీనిపఠనమువలన ఫలముకూడ సాంసారికము కానేరదు ఇంకనేమంటేని యియ్యది పారమార్థికమైన జ్ఞానయజ్ఞమునకు ఫలమని చెప్పవలసియున్నది. ఈభాగమును వ్యాసుఁడు లేక వైశంపాయనుఁడు స్వతంత్రమనియు నత్యంతపవిత్రమనియు నూహించి యిచ్చటనుంచియున్నాఁడు.

వ్యాసమహర్షి శ్రీకృష్ణమతమును ప్రతిపాదించుచున్నాఁడు.

భగవద్గీతాపర్వము అత్యంత పూజ్య తత్వజ్ఞానవిషయకమైన యొక భాగమనియు, దానికి వ్యాసుఁడు లేక వైశంపాయనుఁడు తనభారతగ్రంథమున స్థానమిచ్చెననియు, అందు శ్రీకృష్ణుని విశిష్టమతముల లేక వ్యాసమతముల నావిష్కరించెననియు మనము చెప్పఁగలుగుదుము. ఈగ్రంథము పూజ్యమైయుండుటయు, మోక్షేచ్ఛులకు లేక భగవద్భక్తులకుఁ బథిఁపఁదర్శన వనియే మొదటినుండియు విశ్వసింపఁబడుటయు స్పష్టమైయున్నది. ఇందు శ్రీకృష్ణునియెడ భక్తి పూర్ణముగాఁ ప్రతిపాదింపఁబడుటయు వారి యీశ్వరాంశత్వము సంపూర్ణముగాఁ జూపఁబడియుండుటయు నిర్వివాదమై యున్నది. ఇందలివాక్యములు ప్రత్యక్షము శ్రీకృష్ణుని ముఖమువికాకపోవచ్చును అయినను అవి వ్యాసునిముఖమువి యైయున్నవి. రణక్షేత్రమందు శ్రీకృష్ణుఁడు స్వయముగా నేశబ్దముల నుపయోగించెనో యెవరును జెప్పఁజాలరు. మహాకవుల సంప్రదాయమునమసరించి వ్యాసమహర్షి సంజయుని రణభూమియం

డుఁ దనకొక సంవాదదాయకుని (వాక్ కరస్పాండెంటు)గాఁ జేసికొనెను అతనిచేతనే యుద్ధవృత్తాంతమంతయుఁ బ్రత్యక్షముగాఁ జూచియే యుండు నన్న యుక్తిచేఁ జెప్పించియున్నాఁడు. ఒకవేళనయ్యది కాల్పనికముగా నమ్మఁబడియున్నను శ్రీకృష్ణునిమతములు భగవద్గీతలోఁ జెప్పఁబడిన మతములకు సదృశములై యుండెనని విశ్వసించుటకు నేయాపత్తియును లేదు. బైబిలులోని క్రీస్తువాక్యములు ప్రత్యక్షముగా నాతని ముఖమునుండియే వెడలియుండెనని నిశ్చయపూర్వకముగా నమ్ముటకై యేమి యాధారమున్నది? అతనిశిష్యులుకూడ నవ్విషయమును వర్ణింపకున్నారు; కాని వాని ప్రశిష్యులు సేంటుజాను, సేంటుల్యూకు, సేంటుమార్కు మొదలయినవారు అతని వచనములని చెప్పుచున్నారు. వారి యీవచనములు క్రీస్తుచెప్పిన వచనములయి యుండెనని విశ్వసించుటలోనే ప్రకారముగానే యాపత్తియు నేదో, యట్లే శ్రీకృష్ణార్జునుల భాషణమును లేక సంవాదమునేరూపమున వ్యాసుఁడు సంజయముఖమునుండి వ్రకటించెనో, ఆరూపమున శ్రీకృష్ణుని సంభాషణము అథవా వాక్యములుండెననియుఁ దలంపఁబడఁగలదు. భగవద్గీతలోని శబ్దములు ప్రత్యక్షము శ్రీకృష్ణునివా కావాయను నీప్రశ్నము మన యభిప్రాయమునందు నుచితమైయున్నది. ఈశబ్దములు శ్రీకృష్ణునివి కాకపోవచ్చును, అయినను నిస్సందేహముగా నియ్యవి వ్యాసునివియైయున్నవి. శ్రీకృష్ణునిమతమందలి తాత్పర్యము చూడఁగా వ్యాసుని శబ్దముచేత వర్ణితమై యున్నది. అయినను శ్రీకృష్ణుని మతముననుకూలముగనే యీయన్ని విషయములు నిచ్చటఁ బ్రతిపాదింపఁబడెననుటలో సందియమేమియు నుండదు. ఈవిషయములన్ని కాలములయందు జరిచుటకును మననముచేయుటకును దగియుండును, కాఁబట్టి వ్యాసుఁడు వానికి మనోహరరూపమునిచ్చినచో నాపత్తియేమిటికి? సారాంశము, ఈదృష్టిచేత బైబిలుయొక్కయు భగవద్గీతయొక్కయుఁ బరిస్థితి సమానమని యొప్పుకొనవలసియుండును. రెండుగ్రంథములను ధార్మికదృష్టితోడనే యమర్చబడియున్నవి. క్రీస్తు యొక్క యీశ్వరత్వము విషయమై విశ్వాసమున్న వారికి అతనియుపదేశ సారమును వేర్వేరు ప్రసంగములలోని యతనిభాషణములతో సహితము, తన్మతాను కర్తలు చాలాయేండ్లగడిచిన యనంతరము అతనికిఁబిమ్మట సమ

కూర్చి తమధర్మగ్రంథమును దయారుచేసెరి (సేంటుల్యూకుయొక్క ప్రారభ మును జూడుఁడు). ఇట్లే శ్రీకృష్ణుని యీశ్వరత్వము విషయమై కొంచెమును సందేహములేనియతని భక్తులు, అనఁగా వ్యాస వైశంపాయనమహర్షులు తమదివ్యవాణితో నీధార్మికగ్రంథమును దయారుచేసిరి; శ్రీకృష్ణునితరువాతఁ జాలయేండ్లకుఁ బిదప భారతగ్రంథము తయారయినపుడు వారు దానిమధ్య భాగమందు భగవద్గీతా రూపమున దానికిస్థానమిచ్చి, అందుఁ గర్మాకర్మ సంబంధియగు నత్యంతమహత్త్వముగల ప్రశ్నముపైని, ప్రచరితములై యున్న తత్త్వజ్ఞానములన్నిటి నాధారముచేసికొని, శ్రీకృష్ణుని ముఖమునుండియే విమర్శింపఁజేసిరి.

నేఁటివఱకుఁ బ్రపంచమున నలుగురు పరమవిఖ్యాతులైన ధర్మోపదేశకులు అయియుండిరి. వారు శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు, మహమ్మదు. వీరుప్రతిపాదించిన మతముల నప్పటివఱకు లక్షలకొలఁదియుఁ గోట్లకొలఁదియు లోకులు మన్నించుచున్నారు. ప్రసిద్ధులయిన యీధర్మసంస్థాపకులలో మహమ్మదు మాత్రము తనచేతితోఁ దన ధర్మగ్రంథమును దనయనుయాయులకిచ్చియుండెను. మిగిలిన ముఁవ్వురిచరిత్రములను సంభాషణములను వారిప్రత్యక్ష శిష్యులు కాక. శిష్యులయనుయాయులనేక సంవత్సరములతరువాతఁ బ్రోగుచేసి వారిధర్మగ్రంథమును దయారుచేసియున్నారు. బుద్ధునితరువాత నూరేండ్లకు బౌద్ధగ్రంథములు తయారయ్యెను; క్రీస్తుతరువాత బైబిలు క్రొత్తనిబంధన, కూడ దాదాపిన్నియేండ్లకే తయారయినది. ఇట్టిస్థితిలో వానియందీయఁబడియున్న, బుద్ధునియొక్క లేక క్రీస్తుయొక్క శబ్దములు వారివేయని నిశ్చయముగాఁ జెప్పఁజాలము; అయినను వారి యుపదేశముయొక్క సారమిదేయయి యుండెనని నమ్ముటకు నేయువత్తి యునులేదు. ఇదేవిధముగా శ్రీకృష్ణోపదేశసారమని దెలిసి వ్యాసులు తన గ్రంథము నడుమ స్థానమిచ్చిన భగవద్గీతకుఁ గూడ వ్యాసముఖముననే పూజ్యత్వమిచ్చుటలో నాపత్తియేమియునులేదు. వేయిమాటలేల? ఇందీఁబడిన విషయముల ప్రతిపాదనము శ్రీకృష్ణుని ముఖముచేతనే చేయఁబడెననియుఁ జెప్పుట యుక్తిబాహ్యము కానేరదు.

## ఒకండే శ్రీకృష్ణుండు, ముగ్గురులేరు.

కొందఱు ఏశ్రీకృష్ణునిమతము భగవద్గీతయందుం బ్రతిపాదింపంబడి యెనో ఆ శ్రీకృష్ణుండు వేరు; భారతీయ యుద్ధములోం బాండవపక్షమున చేసిన శ్రీకృష్ణుండు వేఱని చెప్పుచుండిరి. మరికొందరు శ్రీకృష్ణనామకులైన మూండువ్యక్తులను నమ్ముచుండిరి. ఏవిధముగాననంగా గోకులమందు బాలక్రీడలు గావించిన శ్రీకృష్ణుండు, భారతీయయుద్ధమునం జేరిన ద్వారకాధీశుండైన శ్రీకృష్ణుండు, భగవద్గీతయందలి దివ్యోపదేశమును గావించిన భగవానుండగు శ్రీకృష్ణుండు—ఈముగ్గురును వేర్వేరు. గోకుల శ్రీకృష్ణునియందు వర్ణింపంబడిన లీలలు క్రీస్తుయొక్క బాలలీలకు సదృశములయి యున్నవి, కాంబట్టి ఆభీరజాతిలోని గోపులయొక్క గోపికలయొక్క ద్వారమున నీధర్మము క్రీస్తుశకమునకిట్టివల హిందుస్థానమునకు వెలుపలనుండి తీసుకొనిరాంబడెననియుం బిమ్మట వీరు తీసికొనవచ్చిన కృష్ణునికిని భారతమున వర్ణితుండైన కృష్ణునికిని నేకీకరణమయ్యెననియు నీలోకులు, చెప్పుచున్నారు. భగవద్గీతయందు నుపదేశింపంబడియున్న యంత్యంతోదాత్తములయిన తత్త్వజ్ఞానము నీత్యాచరణమును భారతీయ యుద్ధములోని శ్రీకృష్ణుని యాచరణముకంటె విపరీతములయి యున్నవి; అంతియేకాక, ఆయుపదేశము కృష్ణుండు గోపికలతోం గావించియున్న యాయశ్లీలాచరణమునకుంగూడ మిగుల నసంబద్ధమై యుండెను కనుక శ్రీకృష్ణనామకులయిన మూండువ్యక్తులను నమ్మింపుటకయి కొందఱు చేసినసిద్ధాంతమును మనమిచ్చట సంక్షేపముగావిచారింతము.

మనమతమునందొక్క నొకశ్రీకృష్ణుని ముగ్గురు శ్రీకృష్ణులుగాం జేసివయిచుటకునావశ్యకత కొంచెమేని యగపడదు గోకులమందు మరియు మహాభారతమునందున్న శ్రీకృష్ణునియొక్క చరిత్రము యథార్థమున నత్యుదాత్తమై యుండెననియు నయ్యది భగవద్గీతయందలి దివ్యోపదేశముకంటె నేమాత్రమునను విపరీతము కాదనియు మనము ముందువిస్తరించి స్వతంత్రరీతిని జూపంగలము. ఐతిహాసికదృష్టిచేతం బైకల్పన యసంభవమని మాత్రమిచ్చటం జెప్పంగలుగుదుము. భగవద్గీతయందు శ్రీకృష్ణుని 'భగవాన్'

అని చెప్పియుండెను, వ్రితత్త్వజ్ఞానముయొక్క యుపదేశకునకును 'భగవాన్' సంజ్ఞ యుపయోగింపఁబడుచుండెను. అర్జునుఁడు "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం" అని పలుకుటచేత నిజముగా శ్రీకృష్ణునికిఁ దత్వజ్ఞానోపదేశకత్వ సంబంధమున భగవాన్ పదవి యత్యంతయోగ్యమైయుండెను. చాలచోట్ల నర్జునుఁడు శ్రీకృష్ణుని జనార్దన, గోవింద మొదలుగాఁ బేరులతోడనే సంబోధించి యుండెను. అనఁగా భగవద్గీతయందు భగవానుఁడును శ్రీకృష్ణుఁడు నొక్కఁడేయని స్పష్టముగాఁ జూపఁబడియుండెను. అతిప్రసంగమెందులకు, శ్రీకృష్ణుఁడు తన ఐశ్వరీయయోగ సామర్థ్యముచేత నర్జునునికి విశ్వరూపమును జూపినపుడు సైతము అర్జునుఁడుఁ దేవా ! నేను నిన్ను "హేకృష్ణ, హేయాదవ, హేసఖా" అని పిలిచి నీకుఁ గావించిన యవమానము క్షమింపుమనియే చెప్పియుండెను. అనఁగా భగవద్గీతలో విశ్వరూపమును జూపిన భగవానుఁడగు శ్రీకృష్ణుఁడే యాదవుఁడు నర్జున సఖుఁడునైన శ్రీకృష్ణుఁడనియే చూపఁబడియున్నది. భగవద్గీత సౌతికృతమని విశ్వసింపఁబడినప్పటికిని మహాభారతకాలమున అనఁగా క్రీస్తుశకమునకు 300 సంవత్సరములకంటె మునుపు భగవద్గీతోపదేశకుఁడయిన శ్రీకృష్ణుఁడును భారతీయ యుద్ధమందు నర్జునసారథ్యముచేసిన శ్రీకృష్ణుఁడు నిద్దఱును వేర్వేఱనియెవరికిని దృఢనిశ్చయము లేకుండెను. భగవద్గీతయందుఁ భగవానువాచ, శబ్దముయొక్క వ్రయోగమున్నది దీనికిఁగారణముకూడఁ పైనిజూపఁబడియుండెను. ఉపనిషత్తులయందు సైతమిట్లే భగవాన్ శబ్దము వలుమాఱుపయోగింపఁబడియుండెను. ఉదాహరణార్థము, ప్రశ్నోపనిషత్తులయొక్క ప్రారంభమందే దీని నిర్దేశమున్నది–"భగవంతం పిప్పలాదముపససాద" "భగవన్, కుతో ఇమాః ప్రజాః ప్రజాయంతే." ఛాందోగ్యోపనిషత్తునందును "శ్రుతం హ్యేవం మే భగవద్దృశేభ్యః," "భగవ ఇతిహ ప్రతిశుశ్రావ"– ఇత్యాదిప్రయోగములున్నవి. మరియు నశ్వపత్యాఖ్యానమందు, బ్రాహ్మణులు శిష్యులై వైశ్వానరవిద్యను నేర్చుకొనుటకై యశ్వపతియొద్దకు వెళ్లినపుడు ఔపమన్యాదులు "భగవోరాజన్" శబ్దములచేత నశ్వపతిని సంబోధించియున్నారు. ఈయన్ని యుదాహరణములఁబట్టియు భగవాన్‌శబ్దము తత్త్వోపదేశకులయిన యాచార్యులకే యుపయోగింపఁబడుచుండుట సంప్ర

దాయముగాఁ గనిపించుచున్నది, కనుక నయ్యది శ్రీకృష్ణునికిఁగూడ నుప యోగింపఁబడియుండెను. కావున భగవానుఁడయిన శ్రీకృష్ణుఁడు వేఱనియు యాదవశ్రీకృష్ణుఁడు వేఱనియు గల్పనచేయుటయే పొరఁబాటై యున్నది"

ఇదేవిధముగా గోకులకృష్ణుఁడు మహాభారత శ్రీకృష్ణునికంటె భిన్నుఁ డను కల్పనయు నపరిశుద్ధమైయున్నది. గోకులశ్రీకృష్ణుఁడు చేసినచమత్కా రముల వర్ణనము హరివంశమునందుఁగలదు. ఐతిహాసిక దృష్టిచేత శ్రీకృష్ణుని చమత్కారములు క్రీస్తుచమత్కారములతోఁ గలియుచున్నవను కల్పన అసత్యము. ఆభీరజాతి గోపికల ప్రవర్తనము బాగుగా లేకుండెను వారివెంబడి నీబాలదేవుఁడు క్రీస్తుశకమునకిటీవల హిందుస్థానమునకుఁ దేఁబడియెను. మన దృఢనిశ్చయమైతే గోపికలయెడ శ్రీకష్ణుని నడవడిక యథార్థమందుఁ జెడ్డది కాదనియే దీనిని మనము తరువాత వివరింతము కాని మహాభారతమునుబట్టి శ్రీకృష్ణుఁడు మొదట మథురయందు జన్మించెను, పిదపఁ గంసుని భయము వలన నతఁడు గోకులమందలి గోపికలతని నీశ్వరభావముచేత నత్యంతము ప్రేమించుచుండెడివారు. ఇవిమొదలుగాఁ గథలు క్రీస్తువత్సరమునకుఁ బిమ్మ టఁ బుట్టినవికావు; ఇఁకనేమంటేని మహాభారతకాలమునఁ గూడ నయ్యది ప్రచ లితమునై యుండెనని చూపఁబడఁగలదు. హరివంశకాలము చూడఁగా మనకు సందిగ్ధము కావచ్చును, అయినను మహాభారతము దాదాపు క్రీస్తు సం వత్సరమునకు 250 పూర్వముననయి యుండెనని నిశ్చయపూర్వకముగా సిద్ధ మైయున్నది. ఈమహాభారతమందు గోపికలయొక్క వర్ణనము లేక గోకుల శ్రీకృష్ణుఁడు చూపినపరాక్రమములయొక్క వర్ణనము లేదనుమాట యసత్యము ద్రౌపదివస్త్రాపహరణ సమయమునఁ జేసినప్రార్థనమునందు "కృష్ణగోపీజన ప్రియ" అని స్పష్టమైన సంబోధనము కలదు. ఇదేవిధముగా సభాపర్వమం దును శిశుపాలుఁడు తనవధసమయమున—

గోపం సంస్తోతుమిచ్ఛసి।
యద్యనేన హతో బాల్యే శకునిశ్చిత్రమత్ర కిం
తౌవాశ్వవృషభౌ భీష్మ యౌ న యుద్ధవిశారదౌ॥

ఇత్యాదిశ్లోకములయందు (అశ్వ 141) శ్రీకృష్ణుఁడు గోకులమున గోపాలకావస్థయందుఁ గావించిన బాలక్రీడలయొక్క వర్ణన వివరముగాఁ జేసి యున్నది. అనఁగా మహాభారతకాలమున లేక కొంచె మించుమించుగా క్రీస్తు కంటె 300 సంవత్సరములకు మునుపు గోకులమున శ్రీకృష్ణుఁడు చేసిన చర్యలయందలి యన్ని కథలు భరతఖండమునఁ బ్రసిద్ధములుగా నుండెనన్న మాట నిర్వివాదము. ఇంక క్రీస్తునకుఁ బిమ్మట నాభీరజాతివారు క్రీస్తు యొక్క మతములనుండి యీ గాధలనిచ్చటికిఁ గొనివచ్చిరనుట యెట్లుసత్యము కాఁగలదు నారాయణీయోపాఖ్యానమందును గోకులమునుండి మధురకువచ్చి కంసుని శ్రీకృష్ణుఁడును పాండవులకుసాహాయ్యముచేసి జరాసంధ-దుర్యోధనుల జంపించిన శ్రీకృష్ణుఁడును ఒకఁడేయని యీ విషయము స్పష్టముగా వచ్చి యున్నది. శాంతిపర్వమున 3౭8వ యధ్యాయమునందు దశావతారముల వర్ణనకలదు. అందు కృష్ణావతారమునందలి కృత్యములు విశేషించి వర్ణింపఁ బడినవి. ఇంతియేకాక, "మధురయందు నేనే కంసుని జంపితిని" అని మొదటనే చెప్పియుండెను, దీనితరువాత ద్వారకాస్థాపన, జరాసంధవధ మొదలైన యవతారకృత్యములు వర్ణింపఁబడినవి.

ద్వాపరస్య కలేశ్చైవ సంధౌ పర్యావసానికే
ప్రాదుర్భావః కంసహేతోర్మధురాయాం భవిష్యతి 89
తత్రాహ దానవాన్ హత్వాబహూన్ దేవకంటకాన్
కుశస్థలీం కరిష్యామి నివేశం ద్వారకాం పురీం

దీనిఁబట్టి మహాభారతకాలమున లేక క్రీస్తుకంటె 300 సంవత్సరములకుఁ భరతఖండవాసులు గోకులము, మధుర, యీ రెండింటియందలి శ్రీకృష్ణుఁడు ద్వారకయందలి శ్రీకృష్ణుఁడును ఒకఁడేయని చక్కఁగా నెఱిఁగియున్నట్లు నిస్సంశయముగా బోధపడుచున్నది. సారాంశమేమనఁగా అసలు ముగ్గురు శ్రీకృష్ణులుండిరనియు, క్రీస్తుపుట్టినతరువాత వారు ముగ్గురు నొక్కరుగాఁ జేయఁబడిరనియు నీకల్పన యైతిహాసిక దృష్టిచేతఁ గూడ నసత్యమైయుం డెను. ఎల్ల తత్వజ్ఞానము లేక నీతియొక్క దృష్టిచేతఁగూడ శ్రీకృష్ణులు ముగ్గురని యెంచుటకుఁ బనిలేదు అని యీ విషయము ముందుచెప్పఁబడ

గలదు. ఈవిషయమున బొత్తిగా సందేహములేదు, భగవద్గీతయందు నే శ్రీకృష్ణుని మతము ప్రతిపాదింపఁబడెనో, ఆశ్రీకృష్ణుఁడే భారతమునను హరి వంశమునను వర్ణింపఁబడెను మరియు నతఁడే మధురలోని ద్వారకలోని శ్రీకృష్ణుఁడై యున్నాఁడు. ఈశ్రీకృష్ణునియొక్క మతమునే వ్యాసమహర్షి భగవద్గీతయందు నార్షమును దివ్యమును బలవత్తరమునునగు వాణిచేతఁ ప్రతి పాదించి యుండెను.

ఇంతదాఁకఁజేసిన వివేచనమువలన భగవద్గీతయితిశ్రీగా నొక యలౌకిక బుద్ధిశాలియగు కవియొక్క అనఁగా వ్యాసునియొక్క లేక వైశంపాయనుని యొక్క కృతి, అది మొదటినుండియు భారతగ్రంథముయొక్క భాగమును దెలిసి తయారుచేయఁబడినది. సౌతియెపుడు తాను మహాభారతములను విర చించెనో, అపుడు ఆదియెంతయుండెనో, యంతయు వానియెదురనుండెను అని యీవిషయము సిద్ధించుచుండెను. ఈవిధముగా వానియందు, శ్రీకృష్ణుని యొక్క తత్త్వజ్ఞానము ప్రసిద్ధమైన తత్త్వజ్ఞానముతోఁ గూడఁ బ్రతిపాదింపఁ బడెను. శ్రీకృష్ణునితరువాత నతని యీశ్వరత్వమున నమ్మకమున్నవారు పూజ్యమగు ధర్మగ్రంథముపేరితో నీగ్రంథమును రచించిరి ఈ గ్రంథమును జదువుటయు వినుటయు జ్ఞానేచ్ఛులగు పురుషులకుమిక్కిలి లాభదాయక ముగా నున్నది, ఈదృష్టితోడనే యయ్యది రచింపఁబడినది. వ్యాసమహర్షి యీ గ్రంథమును బ్రపంచమునెదుట నుంచుచు నీసూచనగూల నొనర్చెను– "ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన నచాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోభ్యసూయతి (ఎవరు తపముచేయరో, ఎవరికి భక్తిలేదో, ఎవరు వినవలయునని కోరరో ఎవరికి నాయందు నసూయయో, యట్టివారికిది చెప్ప వలదు)

అనఁగా నీగ్రంథమేయుద్దేశమువలన, నేప్రసంగమువలనఁ దయారు చేయఁబడెనో, ఆయావిషయముల గురించి యింతదనుక దిగ్దర్శనము కావిం పఁబడెను. ఇపుడు మనము భగవద్గీతాగ్రంథమేనాఁటిది ? అను ప్రశ్నము వైపు ధ్యానముంపవలయును. ఈగ్రంథము సౌతి రచించినది కాదని గ్రంథ

ములోపలి ప్రమాణములచేతఁ దెలిసియుండెను. అయినను ఈనిశ్చయమే బాహ్యప్రమాణములచేత నగునా? కాదా? మరియు నీగ్రంథముయొక్క నిశ్చితమైన కాలమును మనము తెలిసికొనఁగలమా? లేమా? ఇవి మొదలైన విషయములకు మార్గమువేయుట మహత్త్వమునకును మనోరంజనమునకును పంబంధించిన కృత్యముగానున్నది. ఈవిషయము కేవలము అంతః ప్రమాణములచేతనే సిద్ధించుటకు యోగ్యముండెను; ఎందుచేతననఁగా, దీనికిసంబంధించిన వెలుపలి ప్రమాణములు లభించుట తఱుచుగా నసంభవము.

భగవద్గీత దశోపనిషత్తులకుఁ బరమును,
వేదాంగములకుఁ బూర్వమును నై యున్నది.

భగవద్గీతా గ్రంథము మహాభారతముయొక్క యంతిమ సంస్కరణమునకు మొదటిదన్న విషయము నిర్వివాదము. అది మహాభారతమంతకును ప్రాచీనమని హాస్కిన్, మొదలగు పాశ్చాత్య విద్వాంసులయొక్కకూడ నిశ్చితాభిప్రాయమైయుండెను. అట్టిచో, నాగ్రంథము మహాభారతమునాఁటిది యని యెంచఁబడినప్పటికిని దానియొక్క సమయము క్రీస్తుశకముకంటెఁ బూర్వము 510 సంవత్సరములకు నిటీవలిది కాదని స్పష్టపడుచుండెను. అది దానికీవలి సరిహద్దుగానుండెను. ఇఁకఁ బూర్వపు సరిహద్దునుగూర్చియాలోచింపఁగా నొకవిషయము నిశ్చయముగఁ జూడఁబడును. భగవద్గీతాగ్రంథము దశోపనిషత్తులకుఁ బిమ్మటిది యింకను సాంఖ్యము, యోగము, వేదాంతము అను తత్త్వజ్ఞానములకు ననంతరపుది; ఏలయన ఈమూఁడు తత్త్వజ్ఞానముల వర్ణనయుఁ బ్రధానముగా భగవద్గీతయందుఁ జేయఁబడియుండెను. సాంఖ్యము యోగము, వేదాంతము వీనియొక్క యుత్పత్తి యెపుడైనదియు బొత్తిగా నవిశ్చితము. అనేకోనిషత్తుల విషయమున ఆగ్రంథములు మహాభారతముకంటెఁ దరువాతివి యని కూడఁ జెప్పఁబడఁగలదు. ఈదృష్టివలన మనకు నిశ్చితమైన ప్రమాణమేదియు దొరకుండెను. భారతయుద్ధముతరువాత భగవద్గీత తయారైనదని మనము చెప్పఁగలము; కాని భారతయుద్ధముయొక్క కాలముకూడ సరిగా నిశ్చయింపఁబడలేదు. అది కొందఱ మతమున క్రీస్తుశకముకంటెఁ బూర్వము 310 మరికొందఱభిప్రాయమున నది క్రీస్తుశకమునకు మునుపు 1400 లేక 1.00 వర్షములకు దాదాపుది. అనఁగా భగవద్గీత క్రీ. శ.

పూ. 1000 మొదలుకొని 300 సంవత్సరములదాఁక జరిగినమధ్యకాలమ్మ యని నిశ్చయముగా ననవచ్చును. కాని దీనిఁబట్టి పూర్వమైన మర్యాద (సరిహద్దు) విషయమున సమాధానము కాఁజాలదు. ఇంతకన్నను నిశ్చితమైన ప్రమాణము వెదుకవలసియున్నది. ఈవిషయమునుగూర్చి సూక్ష్మముగాఁ బరిశీలించితిమేని, భగవద్గీత వేదాంగములకంటెఁ బ్రాచీనమన్న యనుమానము గావించుటకుఁ గొన్నిప్రమాణములు దొరకునని తోఁచుచుండెను. అపుడాప్రమాణము లిచ్చట విచారింపఁబడును-అందు మొదటిది యిఁ ఏమనఁగా-

సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః
రాత్రింయుగ సహస్రాంతామ్ తేహోరాత్ర విదో జనాః

(కాలసంఖ్యావిదులయినవారు విరాడ్బ్రహ్మయొక్క పగలు రాత్రియుఁ బ్రత్యేకముగా వేయియుగముల పరిమితిగలవియని తెలిసికొనిరి)

ఈశ్లోకము భగవద్గీతయందుఁ గలదు. ఈకల్పన యుప్పటినుండియు భారతీయ జ్యోతిషమంతటను వ్యాపించియుండెను. ఇది మఱి యెక్కడెక్కడ నున్నదోయని యితరగ్రంథములను బరిశోధింపఁగా నీకల్పన యాస్కుని నిరుక్తమందుఁ గలదు, మరియు మరియొకని యవతరణమును గౌరవించి నీశ్లోకమిచ్చట యవ్వటికిఁ గావలసి తీసికొనఁబడి నట్లుగుపడుచుండెను. ఈ కారణమునుబట్టి యీ కల్పన యాస్కునియొక్క నిరుక్తమునకు భగవద్గీత నుండి కైకొనఁబడి యుండునని యనుమానము బయలుదేఱఁగలదు. భగవద్గీతకు నీశ్లోకము స్వతంత్రముగురీతిని వచ్చియుండెను, అది మఱి యెచట నుండియుఁ దీసికొనిరాఁబడి యునందినట్లు తోఁచదు. అది యుపనిషత్తులయందు లేదు * కల్పనయొక్క యీకల్పనన యెల్లవైదిక సాహిత్యమునందును లేదని చెప్పవచ్చును. ఇందులకు సంపూర్ణమైన వైదికసాహిత్యమును

* దేవసంబంధమైన రెండువేలయుగములు బ్రహ్మకు నొకయహోరాత్రము. ఆయహోరాత్రములు మనుష్యులకు రెండుకల్పములు, అందుఁబగ లుదయకల్పము రాత్రిక్షయ కల్పము.

వెదుకవలసినఁ బనిలేదు, అదిగాక యఁది శక్యముకూడఁగాదు; వైదికానుక్రమ ణిక, యనెడు నమూల్యగ్రంధమున వైదికసాహిత్యముయొక్క చర్చ చేయఁ బడినది. దానియందుఁ గల్పశబ్దము జ్యోతిషమునకు సంబంధించిన యర్థ మునందుఁ బ్రయోగింపఁబడలేదు. "ధాతాయథాపూర్వమకల్పయత్" అను వాక్యమువలన సృష్టియొక్క పునర్వివేచనను గూర్చిన కల్పన లేకుండునని చెప్పఁబడజాలదు. కాని సృష్టిరచనా కాలమునకుఁ గల్పముయొక్క లేక యొకవేయి యుగములయొక్క కల్పన జ్యోతిషవిషయకమైన యభ్యాసము నఁ గొంతకాలము గడచినతరువాత బయలుదేరియుండును. అసలునిజముగా యుగమే పూర్తిగా వైదికకాలమునఁ గల్పింపఁబడియుండలేదు. వైదికకాల మందు నాలుగుయుగములుండెను; ఈకల్పన అయిదేండ్ల పరిమితిగల యుగముకంటెఁ బెద్దయుగముల కల్పనగా స్పష్టపడుచున్నది. కాని వైదిక కాలమున కలి మొదలయిన యుగములకు నవధి సరిగా నిశ్చయమైయుండు నని తెలియఁబడదు. ఈకాలగణన యెప్పుడో యుపనిషత్కాలమున నిశ్చ యింపఁబడియుండెను, మరియు నక్కడనుండి మున్ముందు భగవద్గీతకుఁ దీసికొనిరాఁబడినట్లుగపడుచుండెను. దీనియొక్క చర్చ మరియెచ్చటను లేదు. కాఁబట్టి నిరుక్తముయొక్క యవతరణమునకుఁ జెందిన శ్లోకము భగ వద్గీతనుండికైకొనఁబడియుండెననియనుమానింపవచ్చును. ఈయవతరణము నిరుక్తముయొక్క 12వ యధ్యాయమున నుండుననుట యెంతయు నావశ్య కము అనికూడ ముఖ్యమైయున్నది. అంతమున 13వ 14వ యధ్యాయములు రెండును నిరుక్తముయొక్క పరిశిష్టమునకు నంతర్గతములని పరిగణింపఁబడు చున్నవి. ఈపరిశిష్టము యాస్కునిదే యని యెఱుగుటకు నేయూపత్తియును లేదు; ఎందుచేతననఁగా వైదికులు నిరుక్తముతోపాటు యీపరిశిష్టమును గూడఁ బఠించుచుండిరి. వైదికబ్రాహ్మణులు ఏవేదాంగములను బఠించు చుందురో. వానియందు నిరుక్తముయొక్క యీరెండధ్యాయములనుగూడఁ బఠించుచుండిరని జ్ఞప్తియందుంచుకొన్న యెడల నీరెండధ్యాయములు వేదాం గకర్తయగు యాస్కునివేయని యీ యనుమానమే బయలుదేఱఁగలదు. దీనిఁబట్టి భగవద్గీత యాస్కునికి మునుపటిదియని స్పష్టపడుచున్నది.

కాలవిషయమున నింతకంటెమహత్త్వముగల యింకొకశ్లోకము భగవద్గీత యందున్నది. అది యిది:-

మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావా మానసాజాతా యేషాంలోక ఇమాఃప్రజాః॥

యీ శ్లోకముయొక్క పూర్వార్థము చాలఁగఠినమై యుండెను; ఎందుచేత ననఁగా మొత్తము మనువులు పదునాలుగురని లెక్కింపఁబడియుండిరి, భారత యుద్ధమువఱకు నేడుగురు మానువులైరి" యని జ్యోతిషముయొక్కయుఁ బురాణముయొక్కయు నభిప్రాయము. అట్టిచోనిక్కడ "నలుగురు మనువులని చెప్పఁబడెను" అనిసులభముగా నొకప్రశ్నముకలుగుచుండె. మొత్తము సంఖ్యనుబట్టి పదునాలుగురని కాని కడచినవారిసంఖ్యనుబట్టి యేడుగురని కాని చెప్పవలసియుండెను. ఈకఠిన సమస్యలో మొదటి రెండుపాదములను మూఁడు వాక్యములుగా విభజించుచుండిరి:- 'మహర్షయః సప్త', పూర్వే చత్వారః మనవస్తథా" దీనిఁబట్టి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధవ్యూహములను నాలుగింటిని గ్రహింపవలయునని వీరి యుద్దేశమైనట్లు కనఁబడుచుండెను, కాని స్వయముగా వాసుదేవుఁడు "ఈ నాలుగువ్యూహములు నావలనఁ బుట్టినవి" అని యెట్లుచెప్పును. మొదటి వ్యూహమున వాసుదేవుఁడు అజుడు అనాది పరబ్రహ్మస్వరూపము లెక్కింపఁ బడియుండిరి; అట్టిచో మఱల నాతఁడే (వాసుదేవుఁడే) వాసుదేవునుండి ఎట్లు పుట్టఁగలడు? ఇంక వ్యూహములనే చెప్పఁదలఁచుకొన్న యెడలఁ గడమ మూఁడువ్యూహములను మాత్రము చెప్పవలసియుండెను. అపుడు "చత్వారః" అనుటకర్థము సరిపడదు. ఇదియునుగాక సప్తఋషయః, అనికూడ సరి యైనదికాదని ముందు చూపఁబడును. అనఁగా నీశ్లోకమునకర్థము సరిగా నచ్చలేదన్నమాట.

కాని యీ యర్థము నచ్చకపోవుటకుఁ గారణమిదియై యుండును. ఏమనఁగా, మనము ఇప్పటిదృఢనిశ్చయముఁబట్టి దీనికర్థము చెప్పఁదలఁచు కొన్నారము, ఇప్పటి దృఢనిశ్చయమేమో, దానిపై పునకు ధ్యానము నుంచె దము. కల్పముయొక్క అనఁగా సహస్రయుగములయొక్క కల్పనముఁగా

భగవద్గీతయందును యాస్కుని నిరుక్తమందును గలదని మనము తెలిసికొని యుంటిమి. సృష్టియొక్క యుత్పత్తిమొదలుకొని లయమువఱకు బ్రహ్మకు నొకదినమగుచున్నదనియు అది వేయి చతుర్యుగముల పరిమితిగలదనియుఁ దలపఁబడియుండెను. మనుస్మృతిలో "ఈ వేయియుగములయందు 14 మన్వంతరములున్నవి" అని చెప్పఁబడియున్నది. పదునలుగురు మనువుల యొక్క కల్పన మహాభారతమందుఁగూడ స్పష్టముగాలేదు. కాని మహాభారతమునకుఁ బిమ్మటను చిరకాలమునకే కావింపఁబడిన మనుస్మృతియందు నీకల్పన ప్రాప్తమగుచున్నది. మనుస్మృతిలోనుండుటవల్ల నయ్యది ధర్మ సమ్మతమైపోయెను, మరియును భారతీయార్య జ్యోతిష్కులు దానిని స్వీకరించిరి. ఆర్యభట్టుఁడు మాత్రము దానిని స్వీకరించియుండలేదు. అతని యొక్క (ఆర్యభట్టునియొక్క) యుగములయొక్కయు మనువులయొక్కయు గల్పములయొక్కయుఁ గల్పనమనుస్మృతికంటె భిన్నమైనకారణముచేత నితరు లయిన యార్యజ్యోతిష్కులందఱును వానిని దూషించిరి, ఆతని గ్రంథము ధర్మవిరుద్ధమని స్థిరపరచి [శంకరాదిభారతీ జ్యో. వృ. 103] అనఁగాఁ బదు నలుగురు మనువులున్నారని ఈకల్పన ధార్మికమైయుండెను. నొకభారతీయ జ్యోతిషమునకు దానిని స్వీకరింపవలసివచ్చెను. వాస్తవికమైన కల్పము యొక్క లేక యుగములయొక్క కల్పనకుసరిగా దానియందు లెక్కకుదురుట లేదు. ఏమనఁగా 1000, యుగములను పదునాలుగు మన్వంతరములుగా విభజించుటకు సమానములయిన భాగములు కుదురవు. 6 యుగములు [చతుర్యుగములు] మిగిలిపోవుచున్నవి. అయినను గణితముమీఁదనే యీ కల్పన ఆధారపడి యుండుననికూడ ననుకొనఁగలము, ఎందుచేత ననఁగా రెండు యుగయుల నడుమ నెట్లు సంధిని సంధ్యంశమును బరిగణించితిమో, అట్లే మన్వంతరములయొక్క నడుమను సంధ్యంశములను బరిగణించుట యుచితమగుచున్నది. ఇట్లనుకొని గణితముద్వారమున సంధ్యంశములను దీసికొని మనువులయొక్క సంఖ్యను స్థిరపరిచెదమేని పదునాల్గుతక్క మరి యొకటి నచ్చునే నచ్చదు. ఇది యుదాహరణము మార్గమున ప్రత్యక్షముగాఁ జూడఁగలము. పదునలుగురు మనువులయొక్క కల్పన గణితమునుబట్టి వచ్చినదియు లేక యది ధార్మికకల్పనఁబట్టియే వచ్చినదియు మనము నిర్ణయింప

నక్కరలేదు. అయ్యో ఈసంబంధమున, పదునలుగురు మనువులయొక్క యీ కల్పన మనుస్మృతికిఁ బూర్వమెచ్చటను దటస్థింపదని నిశ్చయపూర్వకముగాఁ జెప్పవచ్చును.

కాని కల్పన మిగుల ప్రాచీనమైయున్నది. ఒకకల్పనమున లేక వర్తమానసృష్టియందు నొకనికన్న నెక్కువ మనువులున్నారను నిక దానియొక్క ప్రాచీనత ఋగ్వేదమునాఁటిది. ఋగ్వేదమున ముగ్గురు మనువులపేరులు వచ్చినవి. ఈపేరులు వైవస్వతుఁడు, సావరణి, సావర్ణ్యుఁడునైయున్నది. మొదటిరెండు పేర్లును ఋగ్వేదముయొక్క యెనిమిదవ మండలములో 51, 52, సూక్తములయందు వరుసగా వచ్చినవి. వారు వాలఖిల్యులలో నివారు మరియు వారికిఁ గర్తలు కాణ్వఋషియగు ప్రుష్టిగుఁడు, ఆయువునైయుండిరి. మొదటి సూక్తముయొక్క మొదటి ఋక్కు ఇది—

> యథామనౌ సావరణౌ సోమమింద్రా పిబః సుతం।
> నీపాతిథౌ మఘవన్ మేధ్యాతిథౌ పుష్టిగౌ శ్రుష్టిగౌ తథా

ఈసూక్తమందు నేది చెప్పబడెనో, యది సావరణీమనువునాఁటిది. రెండవ సూక్తమునకుఁ బ్రారంభముననే మొదటిఋక్కునందు—

> యథామనౌ వివస్వతి సోమం శక్రాపిబః సుతం
> యథాత్రితేచ్ఛన్ ఇంద్రజు జోషస్యాయౌ మాదయసేసచా

ఈప్రకారముగా వివస్వంతుని పుత్రుఁడగు మనువుయొక్క వర్ణనయున్నది. ఋగ్వేదముయొక్క పదియవమండలమున 62వ సూక్తమందు నొకఋక్కులో మూఁడవ మనువుయొక్క పేరు సావర్ణ్యుఁడని వచ్చెను మరియు యొక ఋక్కున సావర్ణియని వచ్చెను. ఈరెండుపేర్లు ఒకనివే. "వైదిక ఇండెక్సులో మనుశబ్దముక్రింద నువర్యుక్తమైన పాదటీక యీయఁబడియున్నది, ఇందు మీఁద మేర్గనార్లు, సావరణియు సావర్ణ్యుఁడును ఐతిహాసికులుగా నగుపడుచున్నారు కాని వైవస్వతుఁడు కల్పితుఁడుగా నగపడుచున్నాఁడని యభిప్రాయపడుచున్నాఁడు. సంవరణుఁడను పేరుగల రాజుయొక్క వర్ణన చంద్ర

వంశమందుఁ గలదు. కాని యిచ్చట వానియొక్క వర్ణన లేదు. ఈమనువు కల్పితుఁడైనను ఋగ్వేదకాలమున నొకనికంటె నెక్కువ మనువుల కల్పన యున్నదనుట నిక్కము. ఇటువంటికల్పన బుద్ధిమంతుఁడన్నవానికెల్లఁగలిగియే తీరవలయును. సృష్టికి నుత్పత్తియున్న తరువాత దానికి నాశముండుననెడి యీకల్పన యెంత స్వాభావికమో, అంతకంటె, నొకమనువుకన్న నెక్కువమనువులున్నారను కల్పన స్వాభావికమైయున్నది; ఎందుచేతననఁగా చాలవంశములు వృద్ధినొంది యటుమీఁద నశించుచున్నవని సాంసారికమైన యనుభవమువలన మనకుదెలియును అదే ప్రకారమె కానొకసమయమున మనుష్యులలో ముఖ్యముఖ్యములైన జాతులు వేర్వేఱుగా నున్నట్లు కనఁబడుచుండెను; అనఁగా భిన్నభిన్నులైన మనువులయొక్క కల్పన యతిప్రాచీనమై యున్నదనుట యసంభవము కాదు.

కాని ఋగ్వేదకాలమున నెంతమంది మనువులున్నదియుఁ జెప్పఁజాలము మహాభారతమునకుఁ బిమ్మటఁ గావింపఁబడిన మనుస్మృతియందుఁ బదునల్గురు మనువులయొక్క కల్పన యుండుటయు, అదే యన్నిపురాణములకును జ్యోతిషమునకును వచ్చుటయు మాత్రము నిర్వివాదము. ఈకల్పనతోఁగూడ మఱిరెండు కల్పనలు చేయఁబడియున్నవి. ప్రతిమనువుయొక్క సమయమునను సప్తర్షులు వేఱుగానున్నారు, ఇంతియేకాక ప్రతిమనువునకును పదిమంది పుత్రులు వంశకర్తలున్నారు, ఆవంశకర్తలు సప్తఋషులకంటె వేఱు, ఈ ప్రకారముగాఁ బదునలుగురు మనువులయొక్క సమయముననున్న వేఱువేఱు సప్తఋషులు 98గురు అగుచున్నారు. అట్లే పదునలుగురికిఁ బదిబదిమంది వంశకర్తలు కలిసి 140మంది వంశకర్తలున్నారు. వీరందఱకు వేరువేరుగాఁ బేరులు పురాణములయందు నీయఁబడియున్నవి. వైవస్వతుఁడు వర్తమాన మనువు. అతఁడు ఏడవవాఁడు. వీనితరువాత నింకను ఏడుగురు మనువులు వత్తురు. ఇట్లు పురాణములయందు విస్తృతమైన కల్పనయున్నది, అక్కడక్కడ భిన్నభిన్నులయిన ఋషులు వంశకర్తలు నీయఁబడియుండిరి, వారి నామముల నిచ్చటఁ జెప్పుట యావశ్యకముకాదు. ఇక్కడకేవలము మత్స్యపురాణమునఁ జెప్పఁబడిన మనువులయొక్క నామములు వ్రాయఁబడును. 1 స్వాయంభువుఁడు, 2 స్వారోచిషుఁడు, 3 ఉత్తముఁడు, 4 తామసుఁడు,

5 రైవతుఁడు, 6 చాక్షుఁడు, 7 వైవస్వతుఁడు. వీరు ఇంతవఱకుఁ గడచిన వారు ఇంక రాఁబోవు మనువులు వీరు:– 8 సావర్ణ్యుఁడు, 9 రౌచ్యుఁడు, 10 భౌత్యుఁడు, 11 మేరుసావర్ణి, 2 ఋతుఁడు, 1 ఋతధాముఁడు, 14 విష్వక్సేనుఁడు. ఇతరపురాణములయందు రాఁబోవు మనువులపేరులు మఱియొకవిధముగానున్నవి అంతేకాక వానియందు "సావర్ణి" శబ్దమునుండి కల్పింపఁబడినట్లుగానున్న "దక్షసావర్ణి, రుద్రసావర్ణి" మొదలుగాఁ జాలపేర్లు వచ్చియుండెను. ఋగ్వేదములోఁ జెప్పఁబడిన సావర్ణి యీసూచియందు బొత్తిగా రాలేదని యిచ్చట వచించుట యావశ్యకము. అందు ఇఁక సావర్ణ్య మనువు రాఁగలడని స్పష్టముగాఁ జెప్పఁబడియుండెను. ఋగ్వేదములోని వర్ణనవలన ఈమనువు పూర్వమెప్పుడును రాలేదనియు వీనికి యదుతుర్వ సునితో సంబంధముకూడఁ గలదనియు నగపడుచున్నది ఈవివేచనము వలన ఋగ్వేదములోఁ గావింపఁబడిన యనేక మనువుల కల్పన యంతకంతకు వ్యాపించియుండునని వెల్లడియగుచుండెను; కాని యందీయఁబడిన వారి పేరులు తఱచుగా నదివఱకే యుండెను.

ఆలోచించి చూచినయెడల భగవద్గీతలోని 'మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తథా' యన్న యీశ్లోకము వైదికకాలమునందల్లి కల్పనకు సరిపోవుచున్నదనియు నయ్యది మన్వాది గ్రంథములలోని చతుర్దశమనువుల కల్పనకుఁ బూర్వమనియు దోఁచుచుండెను ఋగ్వేదమందు ముగ్గురు మనువులు చెప్పఁబడియుండి . అట్లే యాస్కుని నిరుక్తమున (3-1-5) మనుః స్వాయంభువోఽబ్రవీత్, వాక్యమందు నాల్గవ మనువుయొక్క పేరువచ్చియుండెను. అనఁగా భగవద్గీతయందు వచ్చిన స్వాయంభువుఁడు, సావరణి, సావర్ణ్యుఁడు, వైవస్వతుఁడు నను నలుగురు మనువులయొక్క వర్ణన వైదికసాహిత్యముయొక్క ఆధారము మీఁదనే యవలంబితమై యుండెను. వివస్వంతుని పుత్రుఁడే వర్తమాన మనువనెడు కల్పన ఋగ్వేదముకంటె మఱియొకదానినుండి స్పష్టపడుటలేదు. మఱియు నయ్యదే నేను కర్మయోగమును వివస్వంతునికిఁ జెప్పితినని భగవద్గీత యందుఁ గలదు. అతఁడు మనువునకుఁ జెప్పెను మనువు ఇక్ష్వాకునకుఁ జెప్పెను. అనఁగా వర్తమాన మనువు వైవస్వతుఁడన్నమాట ఆసమయమున గౌరవింపఁబడినట్లు కనుపట్టుచుండెను.

పదునలుగురు మనువులయొక్కయు ప్రతియొక్క మనువునకు వేర్వే రుగా సప్తర్షులయొక్కయు వంశకర్తలయొక్కయుఁ గల్పన భగవద్గీతాకాల మున లేదు. ఈ పై యనుమానము కేవలము 'నలుగురు మనువులు' అను శబ్దములనుండియే వచ్చినదికాదు. ఇఁకనేమంటేఁ 'ఏడుగురు మహర్షులు' అను శబ్దములనుండికూడ వచ్చుచున్నది. ఎందుచేతననఁగా ఏడుగురు మనువులయొక్కయు వారికి భిన్నభిన్న సప్తర్షులయొక్కయుఁ గల్పన ప్రసిద్ధమైయున్నయెడల, నిచ్చటనేడుగురేడుగురు మహర్షులు అనిచెప్పి యుండును (శ్లోకములో మహర్షయః సప్తసప్త ఈశబ్దము లుండవలయును) ఇందువలనఁ దోఁచునది యేమనఁగా భగవద్గీతకిష్టులయిన మహర్షులు వైదిక కాలమువారు. ఈసప్తర్షులు వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, విశ్వామిత్రుఁడు, జమ దగ్ని, గౌతముఁడు, భరద్వాజుఁడు, అత్రియునై యున్నారు. వీరియొక్క యుచ్చారణ బృహదారణ్యకమందున్నది. రెండవబ్రాహ్మణమున ఋగ్వేదము లోని ఋక్కు 'తస్యాసత ఋషయః సప్తతీరే' నకు వ్యాఖ్య గావించునప్పుడు "ప్రాణావా ఋషయః। ప్రాణానేతదాహ ఇమావేవ గౌతమభరద్వాజౌ" "ఇమా వేవ విశ్వామిత్ర జమదగ్నీ ఇమావేవ వశిష్ఠకశ్యపౌ వాగే వా త్రిః॥, అని చెప్పెను. ఋగ్వేదములోని సూక్తములను జేసినవారు తఱచుగా ఎరేయయి యున్నారు. వీరేయుత్తరధ్రువమున సంచరించినట్లు వర్ణనకలదు. పురాణ ములందు, వర్తమాన మన్వంతరములో సప్తర్షులు వీరేయని చెప్పఁబడెను' అనఁగా నైతిహాసికులయిన సప్తర్షులు వీరే. ఎపుడు వేరువేరు మనువులకు వేరువేరు సప్తర్షులు పరిగణింపఁబడిరో, అపుడు మొదటివాఁడగు స్వాయంభువు మనువుతోడి సప్తర్షులు మహాభారతమునందు శాంతిపర్వముయొక్క 335వ యధ్యాయమున నిట్లు చెప్పఁబడియున్నారు :—

మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః
వసిష్ఠశ్చమహాతేజా స్తేహి చిత్ర శిఖండినః ॥

ఈ శ్లోకమున వారియొక్క యుచ్చారణము లేదని మనము కనుగొను చున్నారము, ఎందుచేతననఁగా వీరుతఱచు కాల్పనికులై యున్నారు 'వైదిక ఇండెక్సు' పుస్తకమును జూచినయెడల పులస్త్యుఁడు, పులహుడు, క్రతువు,

వీరియొక్క యుచ్చారణ ఋగ్వేదమందు వచ్చియుండెను. వీరందఱును ఋగ్వేదసూక్తములకుఁ గర్తలుగూడనయి యుండిరి. వసిష్ఠునికి, విశ్వామిత్రునికి, భరద్వాజునికిని సంపూర్ణములయిన మండలములున్నవి. అత్రికిని, ఆత్రేయునికినిగూడ మండలమున్నది. సూక్తకర్తలగు కశ్యపుఁడు, జమదగ్నియుఁడు గూడ మరియొకమండలమున నున్నారు. కణ్వునికి వేరే యొక స్వతంత్రమండలమున్నది. కాని యాతనిపేరు మహర్షులయందు లేదు. కాని కణ్వమహర్షి మనువంశములోని చాంద్రవంశియును వాఁడయి యుండెనని మహాభారతమునుండి హరివంశమునుండియు నగుపడుచుండెను. సారాంశము, అందఱకు నుత్పత్తికర్తలయిన "పూర్వే" మహర్షులు ఏడుగురు. 'మహర్షయః సప్తపూర్వే, యనుచోట పూర్వేశబ్దమునకిదే యర్థము. ఇతరమహర్షులుకూడ నుందురుగాక, కానివారు 'పూర్వే, లేక యందఱుపూర్వులకు నుత్పత్తికర్తలు కారు. అది యట్లుండుఁగాక. భగవద్గీతవాక్యమునఁ జెప్పఁబడిన సప్తర్షులు ఇతిహాసప్రసిద్ధులయిన సప్తర్షులే యైయున్నారు. 'యేషాంలోక ఇమాః ప్రజాః, అనుచోట వీరును మరినలుగురు మనువులును నేఁటివఱకుఁ బుట్టుచున్న ప్రజలకు నుత్పాదకులని సూచింపఁబడియున్నది.

ఈపర్యుక్తమైన వివేచనమువలన భగవద్గీతాకాలమున నేడుగురు మహర్షులు నలుగురు మనువులు నుండిరని తెలియుచుండెను. వైదికసాహిత్యముతోఁ గలసిమెలసియున్న యీ కల్పన యప్పుడు ప్రసిద్ధముకూడనయి యుండును. ఈకాలమునకుఁ బిమ్మట కల్పనఁ బదునలుగురు మనువుల యొక్కయుఁ బ్రతియొకమనువుతోడను వేరువేరు సప్తర్షుల పేరులు ప్రసిద్ధమై యుండెను, ఇంతియొకాక నేఁటికి నేడుగురు మనువులు గతించిరని ఈ సిద్ధాంతము మనుస్మృతియందుఁ బురాణములయందును స్పష్టముగాఁ జూడఁబడుచున్నది. దానినే జ్యోతిష్కులు తీసికొనిరి. మహాభారతమున—లేక సౌతియొక్క మహాభారతమున—పదునలుగురు మనువులయొక్క కల్పన స్పష్టముగా లేదు, అయినను ఆసమయమున నయ్యది ప్రసిద్ధమై యుండునని తోఁచుచుండెను. శాంతిపర్వముయొక్క 34 వ యధ్యాయమందు భగవద్గీతలోని యీ కల్పనయే మొదటి స్వాయంభువ మనువుమీఁదఁ బెట్టఁబడినది. అదిగాక సప్తర్షులనుండియు మనువునుండియుఁ బ్రజలు బుట్టుచున్నారని వర్ణన చేయఁబడియున్నది.

మరీచిరంగిరాశ్చాత్రిః పులస్త్యః పులహః క్రతుః
వసిష్ఠశ్చ మహాత్మాపై మనుః స్వాయంభు వస్తథా ॥
జ్ఞేయాః ప్రకృతయోఽష్టౌతాసు లోకాః ప్రతిష్ఠితాః।
అష్టాభ్యః ప్రకృతిభ్యశ్చ జాతం విశ్వమిదం జగత్ ॥

దీనిఁబట్టి యొకప్పుడు మహాభారతకాలమందే, ప్రతియొక మన్వంతరమునను ప్రజలెట్లు ఉత్పన్నులగుచున్నారనియు, వేరువేరు మహర్షులు వంశకర్తలును ఎట్లగుచున్నారనియుఁ, దలఁపఁబడియుండును. ఇచ్చట, భగవద్గీతాకాలమునకును మహాభారతకాలమునకును జాల యెడముండియుండునని యనుమానము కలుగుచుండెను, భగవద్గీతాకాలము వైదికకాలమునకు సన్నిహితమే యైయుండునని కూడఁ దెలియుచుండెను. కాని యింతమాత్రమువలన నిశ్చయాత్మకమైన కాలముయొక్క యనుమానము బయలుదేఱఁ జాలదు, అయినను అది యవశ్యము మిక్కిలిప్రాచీనమని యగపడుచున్నది.

ఇంతవఱకు మనము, భగవద్గీతకాలము విషయమై 'మహర్షయః సప్త పూర్వేచత్వారో మనవస్తథా, శ్లోకార్థముఁ మిగులమహత్త్వము గలదియనియుఁ బైకల్పనవలన దానియర్థముకూడ సరిగా నచ్చుచుండెననియుఁ గనుగొని యుంటిమి. ఇటువంటి మహత్త్వముఁగలదే మరియొకటి మూఁడవది జ్యోతిర్విషయకమైన వర్ణనము భగవద్గీతయందుఁ గలదు అది దిఇ—

మాసానాం మార్గశీర్షోహ । మృతూనాం కుసుమాకరః।

ఈశ్లోకార్థము పైకి సరళముగా నగపడుచుండెను; కానియందుఁ జాలచారిత్రిక జ్ఞానము గూఢమైనది యిమిడియుండెను. ఇచ్చటనొకప్రశ్న కలుగుచుండెను ఏమనఁగా, శ్రీకృష్ణుఁడు నెలలలో మార్గశీర్షమునకును ఋతువులలోఁ గుసుమాకరమునకును నగ్రస్థానముఁనేల యిచ్చియుండెను ? ఇవిరెండును శ్రీకృష్ణునికిఁ బ్రియములయియుండెనని చెప్పుదుమేని, అపుడు ముందుఁ చెప్పుటకు నేమాటంకమును లేదు. కాని యిది హేతువు కాఁజాలదు. మాసములకు మొదట మార్గశీర్షము ఋతువులకు మొదట వసంతముగల్గింపఁబడెననుట స్పష్ట

మైయుండెను. అందువలన వానికి న్రగస్థానమీఁబడెను, అదిగాక మార్గ శీర్షమాసము శ్రేష్ఠముగా నగపడినయెడ హేమంతఋతువు నైతమట్లే యిష్టపడ వలసియుండెననియుఁ జెప్పఁగలుగుదుము, కానియట్లు కాదయ్యెను. కనుక మనము చెప్పునదియే సత్యమైయుండును. అపుడు మాసములలోఁ జైత్రము ఋతువులలో వసంతము మొదటివై యున్నవి. లోకులలెక్కయందు రెండి టికి నైక్యము నైతముఁడెను. యథార్థమున వసంతఋతువు నేండు ఫాల్గునముకంటెఁగూడ ముందువచ్చుచుండెను; అయినను చైత్రవైశాఖము లతో వసంతర్తువును లెక్కింపనారంభించినది మొదలుకొని రెండిటికి నైక్యము నిశ్చితమయ్యెను, అవి తమతమ వర్గమున న్రగస్థానమందున్నవి. ఈగణన నించుమించుగా క్రీస్తుశక ప్రారంభమున భారతీయార్వచీన సిద్ధాంతాది జ్యోతి షము ప్రారంభించెను మాసగణనయందు మార్గశీర్షమును ఋతుగణయందు వసంతమును ముందుగా గణించుట భరతఖండమున నెప్పటినుండి ఆరంభ మయ్యెనో యిపుడు మనము చూడవలసియుండెను. యిది నిశ్చయముగా నెరిగినచో భగవద్గీతాకాలమును మనము శీఘ్రముగనె దెలిసికొనఁగలము.

ఈప్రశ్నము ప్రసిద్ధమైన దీక్షితుని గ్రంథముయొక్క సాహాయ్యమున నైతిహాసికరీతిని విచారింపఁబడును. వైదికసాహిత్యమందు ఋతువుల నిర్దేశ మెపుడును వసంతముతో నగుచున్నది. ఈఋతువులు 6 ఉండెను. అచ్చ టచ్చట నయిదు ఋతువులయొక్క నిర్దేశముకలదు. శతపథబ్రాహ్మణమున దీనికిఁ గారణము చివరి రెండుఋతువులు శిశిరము హేమంతము ఒక్కటిగా విశ్వసింపఁబడుటయని విశదీకరింపఁబడియెను. రోమనువ్రజల యితిహాసము బట్టిగూడ, ఆర్యులు హిమాలయమున కుత్తరమున నివసించుచుండినపుడు, వారు సంవత్సరమునకుఁ బదిమాసములనే మన్నించుచుండిరని విదితమగు చుండెను; ఎందుచేతననఁగా రెండుమాసములు సూర్యుని జాడ బొత్తిగా నగపడకుండెను. ప్రాచీనవైదికకాలమందు నుత్తరాయణము వసంత సంపాత మునఁనే విశ్వాసింపఁబడి యుండునని తోఁచుచుండెను. ఎందుచేతననఁగా సూర్యుఁడు వృక్షోపరిభాగమునకు వచ్చినప్పుడే ప్రపంచవ్యవహారము జరుగు చుండెడిది మనుష్యులకానందము కలుగుచుండెది. అనఁగా రెండుమాసముల

పర్యంతము సూర్యుఁడు బొత్తిగా నస్తమించిపోయిన పిమ్మట శీతబాధ ముగిసిన యనంతరము ఆర్యులను వికాసము జీవనశక్తియుఁ బ్రాప్తమగుచుండెడిది. ఇందువలన స్వభావమునుబట్టి వైదిక కాలమందు వత్సరారంభము వసంతముతో నగుచున్నదనియే వన్నుచుండియుందురు. ఈకాలము హిమాలయమున కావల బహుప్రాచీనమైన నివాసస్థానముది యైయుండును. కాని యెపుడార్యులు హిందుస్థానమునకు వచ్చి నివసించిరో, జ్యోతిషశాస్త్రము యొక్క యభ్యాసముకూడ వర్ధిల్లెనో యపుడీపరిస్థితి మారిపోయెను. సూర్యుఁడు సంవత్సరమంతయు వృక్షముమీఁదనే యుండ నారంభించెను మరియు నతనియుదయస్థానముత్తరమునుండి దక్షిణమునకు దక్షిణమునుండి యుత్తరమునకును మ్మారన్నారంభించెను. ఆసమయమున వసంతప్రవేశముతో నుత్తరాయణారంభమునొప్పుకొనక జ్యోతిషికులు సూర్యుఁడు దక్షిణము నుండి యుత్తరమునకుఁ తిరుగ మొదలిడినపుడు ఉత్తరాయణము యొక్క గణన నారంభించిరి. ఈ కాలము వేదాంగజ్యోతిషమందుఁ జూపఁబడియున్నది.

కాని వైదికకాలమందును నింకొక గొప్పభేదమున్నది, వైదికకాలమందుఁ జైత్రవైశాఖాది మాసనామములే లేకుండెను. ఈనామములు వేదాంగ కాలమున వచ్చినవిగా నగపడుచున్నవి. వైదికకాలమందు మధు మాధవ శుక్ర శుచి నామములు వసంతక్రమమునఁ బ్రచలితములయి యుండెను. మాసములకుఁ బర్యాయపదములయిన యీపేరులునేఁటిపర్యంతము సంస్కృత గ్రంథములోఁగలవు, కాని ఆనామములు తఱచుగా నగపడవు. చైత్రవైశాఖాది నామములు ముఖ్యముగా వైదికకాలమునకిటీవలి సాహిత్యమందు గనఁబడుచున్నవి. దీక్షితునియొక్క జ్యోతిర్విషయకమైన గణనవలన, ఈనామములు క్రీ. పూ. 2000 ఏండ్ల దాదాపునఁ బ్రచలితములయి యున్నట్లు తెలియుచుండెను. వైదికగ్రంథముల ప్రామాణ్యముబట్టియు నిట్లేకనఁబడుచుండెను. వేదాంగజ్యోతిషము పాణిని కల్పసూత్రము లోనగు గ్రంథములలో నీనామములే యీఁబడియున్నవి. దీక్షితునిలెక్కబట్టి వేదాంగజ్యోతిషముయొక్క కాలము క్రీ.పూ. 1400 యేండ్లపూర్వమని నిశ్చితమగుచుండెను. ఇపుడు శతపథబ్రాహ్మణముయొక్క యుత్తరకాండమున వైశాఖముయొక్క పేరొకమారు వచ్చియున్నది (ఈ. జ్యోతిషశాస్త్రముయొక్క యితహాసము పే 60)వ

కాండమునుండి తరువాతివయిన యీయుత్తరకాండములు పిదపఁజేయఁబడి యున్నవి. మొదటి పదికాండములయందును నీనామములు బొత్తిగా నగ పడవు; మధు, మాధవనామములే కనఁబడుచున్నవి; మరియు శతపథములోని కృత్తిక సరిగాఁ దూర్పున వెడలుచుండెను, యనునీవచనముఁబట్టి దీక్షితుఁడు శతపథకాలమును క్రీస్తుకంటె :000 పూర్వమని నిశ్శంకముగా నిశ్చయించియుండెను. అనఁగా క్రీస్తుసంవత్సరముకంటె 3000 ఏండ్లకుఁబూర్వము శతపథకాలమనియు 400 ఏండ్లపూర్వము వేదాంగజ్యోతిషకాలమునకు నడుమ మార్గశీర్షము సేషముమొదలుగా నామములు ప్రచలితములయి యుండె ననియు వారిగణితమునుండి బయలుదేరిన యీసిద్ధాంతముసత్యమైయున్నది.

'మాసానాం మార్గశీర్షోఽహం, వాక్యమునుబట్టి భగవద్గీత బ్రాహ్మణ గ్రంథములకిటీవలిదియను సిద్ధాంతము బయలుదేఱుటకు నేయాపత్తియును లేదు. అనంగా దశోపనిషత్తులు బ్రాహ్మణములలోని భాగములని నమ్ముటకు నేయాతంకమును లేదయ్యెను. భగవద్గీత వానికిఁబిమ్మటిది లేక దాదాపుగా నాసమయముదే యని విశ్వసింపఁగలుగుచున్నాము. కాని 'మార్గశీర్షము మొదటి మాసము, వసంతము మొదటిఋతువు, అనునీవాక్యముఁబట్టి భగవద్గీత వేదాంగజ్యోతిషమునకు మునుపటిదిగా నగపడుచుండెను. వేదాంగమునను త్తరాయణము వసంతసంపాతముతో నగునని విశ్వసింపక మకరసంక్రమణముతో నమ్మతింప మొదలిడెనని పూర్వము చెప్పఁబడియుండెను. వేదాంగమందీ యుత్తరాయణము మాఘమాసమున నగుచుండెను దీనిఁబట్టి జ్యోతిష్కులమతములనుసరించి వర్షముయొక్క అరంభము మాఘముతోనగుచుండెను. అయిదుసంవత్సరముల యుగము నంగీకరించి రెండధికమాసములు ఒకమాసము మాఘమునకు మొదటను మరియొకటి రెండున్నర వత్సరముల తరువాత శ్రావణమునకు మొదటను విశ్వసింపఁబడునను నీలెక్కబట్టి కలుపఁ బడెను. సంవత్సరమునకు మొదటిది మాఘమని విశ్వసింపఁబడునేని ఋతువులకు మొదటిది శిశిరమని విశ్వసింపవలసియుండునని స్పష్టపడుచుండెను. ఇటువంటిగణన భారతీయకాలమందొకప్పుడుండెను. ఈసంగతి మహాభారతములోని యశ్వమేధపర్వమునందలి యీ శ్లోకముఁబట్టి కనఁబడుచున్నది.

అహః పూర్వం తతో రాత్రిర్మాసాః శుక్లాదయః స్మృతాః ।
శ్రవణాదీని ఋక్షాణి ఋతవః శిశిరాదయః ॥ (2అ 44)

ఇందు, ఋతువులయొక్క ప్రారంభము శిశిరముతో నగుచున్నవని చెప్పియున్నాఁడు. ఈశ్లోకము అనుగీతలోనిది యిందు ఋతువులయొక్క మాసములయొక్కయుఁ బ్రారంభము భిన్నరీతుల నగుచున్నదని చూపియుండెను. ఇచట నక్షత్రముల ప్రారంభము శ్రవణముతో నగుచున్నదని సమ్మతింపఁబడియున్నది. అదియట్లుండె, ఈకాలము క్రీస్తుకంటె దాదాపు 45U వర్షములు మునుపటిదియని దీక్షితుఁడు చెప్పియున్నాఁడు. మహాభారతమందు నితరస్థానములలో నెలలయొక్క గణన మార్గశీర్షముతో నారంభింపఁబడెనని యిందుఁ జెప్పియుంచుట సమయోచితమైయున్నది. అనుశాసన పర్వములోని 09వ యధ్యాయమందు విష్ణువి పండ్రెండు పేరులతోడను బండ్రెండునెలల వఱకు ఉపవాసము చేయుటకై ఫలమేమినచ్చునో వర్ణింపఁబడియుండెను. అచ్చటఁగూడ నెలలు మార్గశిరముతోడనే యారంభించఁబడియున్నవి. అచటఁ బ్రతినెలయందు నేకభుక్తోపవాసము చేసినందులకు నేమి ఫలము లభించునో యిదికూడఁ జెప్పియున్నాఁడు. ఇందుచేత సామాన్యముగా మహాభారతకాలమువఱకు మాసముల ఆరంభము మార్గశిరముతో నగుచుండెడిదని చెప్పవలసియున్నది. పారాశర్యగృహ్య సూత్రమునందు మార్గశీర్షపూర్ణిమనాడు సంవత్సరేష్టి చేయవలయునని చెప్పియున్నాఁడు కాని యచట హేమంతఋతువునకే ప్రాధానమీఁబడియున్నది; ఎందుచేత? హేమంతమునకే హవిర్భాగ మీవలయునని వర్ణనము కలదు. అనఁగా మార్గశీర్షమునుండి హేమంతమును మొదటిఋతువుగా మన్నింపవలయునని స్పష్టపడుచున్నది. కాని, భగవద్గీతయందు 'మాసానాం మార్గశీర్షోఽహం' అనిచెప్పి 'ఋతూనాం కుసుమాకరః, అనియేల చెప్పెనో? యిదియొక గొప్ప యాశ్చర్యముగానున్నది, దీనిఁబట్టి యీశ్లోకము బ్రాహ్మణములకుఁ దరువాతనే వ్రాయఁబడియుండునని యనుమానము జనింపఁగలదు. ఈశ్లోకము క్రొత్త నెలలు ప్రచారములోనికి వచ్చినతరువాత విద్యమానదశకు వచ్చెననియు అప్పటికి వైదిక కాలమునాఁటి ఋతువులే ప్రసిద్ధములై యుండెననియుఁ జెప్పవలసియుండు. ఈశ్లోకము వ్రాయఁబడినప్పుడు ఈవేదాంగ జ్యోతిషములోని మాఘాదిమాసములు ప్రచలితము కావలయునని లేక శిశిరాదిఋతువుల గణనయే చేయఁబకుండెననియు నిశ్చయమగుచున్నది. వైదికమునాఁటి

ఋతుగణన ప్రచారములో నుండి నెలలయొక్క క్రొత్త పేరులు ప్రసిద్ధములైన పుడు చైత్రాదులే యెందులకుఁ బ్రసిద్ధము చేయఁబడకుండెనని ప్రశ్న మిచ్చట నుపస్థితమగుచున్నది. వైదికమునాఁటి ఋతుగణన వసంతమునుండి యగు చుండెననుట సత్యము; కానిఆర్యులు యమునానదిదాఁటి దక్షిణమున సౌరాష్ట్ర ప్రాంతమందు సముద్రముదాఁక నివసింప మొదలిడినపుడు ఈయుష్ణదేశమున శీతకాలదినములు విశేషదుఃఖప్రదములయి కనఁబడియుండుసు మార్గశీర్షము నుండియే మాసముల గణన ప్రారంభమైయుండును. ఈపరిపాటి బహు ప్రాచీనమని నిశ్చయముగాఁ జెప్పఁబడఁగలదు. ఈపరిపాటి భగవద్గీత, మహా భారతము, పారస్కరగృహ్యసూత్రము మొదలుగా నన్నింటియందును గనఁ బడుచుండెను: అది యమరకోశములోఁగూడ నీఁబడియుండుట యన్నిటికంటె నెక్కువగాఁ దగియుండెను. అమరకోశములోనున్న నామములు మార్గశీర్షము మొదలుకొని యీఁబడియున్నవి. 'మార్గశీర్షః సహా సూర్య, మొదలుగా పద్యములు ప్రసిద్ధములయి యున్నవి వెనువెంటనే ఋతువులనామములు హేమంతము మొదలుకొనియే యీఁబడియున్నవి. అందులోఁ బాహులోౕ కార్తికో, అనిచెప్పి 'హేమంతః శిశిరోఽస్త్రియామ్, అనిచెప్పియున్నాఁడు, మరియు నంతమున షడమీ ఋతవః పుంసి మార్గాదీనాం యుగైః క్రమాత్ అనివ్రాసియున్నాఁడు. 'అమరుఁడు, ప్రాయికముగా క్రీస్తుశకమునకిటీవలి వాఁడై యుండెను; కాని యతఁడుసైతము చైత్రాదిమాసములను వ్రాయఁ డయ్యెను; దీనిఁబట్టి యేదైన క్రొత్త లెక్క అరంభమగునపుడు అదేచాలదిన ములవఱకు నెట్లు ప్రచలితమగుచున్నదో దెలియఁగలదు. అల్బెరూనీ యతని సమయమున సింధువు మొదలయిన ప్రాంతములలో మాసములు మార్గశీ మాదిగా నుండెనని వ్రాసియుండెను. మాసముల నామధేయము మొదట మార్గశీర్షము మొదలుకొని పశ్చిమోత్తర (?) శౌరసేని, సౌరాష్ట్రములోనగు ప్రదేశముల యందు నారంభమైనవని తాత్పర్యము. ఆవశ్యముగా మొదట వైదికము నాఁటి వసంతాది ఋతువులకే ప్రచారమైయుండును. దీనికి సంబంధించి నగవద్గీతావాక్యము క్రీస్తునకుఁ బూర్వము 100 –1470 నడిమిదియై యుం డెను. దీనికిఁ బిమ్మట వేదాంగజ్యోతిషమందు మాఘాదివిశేషములును నిశ్చిత ములయియుండెను మరియు ధనిష్ఠాదిగా నక్షత్రములుండెడివి, ఎందుచేత

ననఁగా ధనిష్ఠయందు నుదగయనమొండెను. ఈ ప్రకారముగా గణితము యొక్క ఆధారముమీఁద నీకాలము క్రీ. పూ. 1400 సంవత్సరమునకు దాదాపు దియని నిశ్చితమగుచుండెను. తరువాత నొకనక్షత్రము వెనుకకుఁబోయి ఉత్తరాయణము శ్రవణము మీఁదఁగా నారంభించెను. ఆకాలము గణితమును బట్టి క్రీ పూ. దాదాపు 400 వత్సరముందిగాఁ దేలుచున్నది. అప్పటియనుగీత లోఁ శ్రవణాదిని నక్షత్రాణి ఋతవః శిశిరోదయు యనువాక్యముండెను. అనఁగా అపుడు మఘాదులయిన మాసములు శిశిరాదులయిన ఋతువులు నుండెను. దానితరువాత మహాభారతముయొక్క యంతిమ సంస్కరణ సమయమైయుండెను; కాని యీసమస్తకాలమందును, భగవద్గీత ప్రచారము లోనికిఁ దీసికొనివచ్చిన మార్గశీర్షది గణనయుఁ బ్రచారములోనున్నది. మరియు దానితోపాటు, పారస్కరగృహ్యసూత్రమందును నమరకోశమందును జెప్పఁబడియున్నట్లు ఋతువులు హేమంతాదులయి యుండెను. ఈ వేర్వేరు గ్రంథములన్నిటి పరంపరనుబట్టి భగవద్గీతాకాలము క్రీ. పూ. 2000–400 మధ్యదియైయుండునని యూహ బయలుదేఱఁగలదు; అనఁగా అయ్యది యుపనిషత్కాలమునకుఁ బరమునను వేదాంగజ్యోతిషమునకు పూర్వమునను నైయుండును *

* 1 "మధువు మొదలయిన మాసనామములు ఋతువులతో సంబంధించి యుండెను. కాని నక్షత్రములతో వానికి సంబంధమేమియును లేదు" భారతీయ జ్యోతిషశాస్త్రము పే 37)– ఈయంశము ధ్యానములో నుంచుకొనవలయును. వైదికకాలమున మధుశ్చ మాధవశ్చ వసంతః, అని చెప్పఁబడుచుండెడిది, కాని ఆసమయమున దీనికిమేళనము నక్షత్రములకు సంబంధించిన చైత్రవైశాఖాది మాసములతో లేకుండెను. ఈమైత్రి క్రీస్తుశక ప్రారంభమున మాసగణన చైత్రాదిగను నక్షత్రగణన యశ్విన్యాదిగను జేయఁబడి నారంభింపఁబడినప్పటినుండి యయ్యెను, అప్పటినుండియు మధువునకుఁ బర్యాయముగాఁ జైత్రము నిర్దిష్టమయ్యెను. వైదికకాలమున మధ్వాదినామములు కృత్తికాదినక్షత్రములతోపాటు ప్రచలితమునయియుండెను. అపుడు వసంతమునకు నక్షత్రసంబంధమైన నెలయేదీ యయ్యెనో తెలిసికొనవలసియున్నది.

ఆదిచ్చె త్రిమునకు మునుపటిదియైయుండుననుట స్పష్టమైయుండెను. ఈ దిన ములలో వసంతము చైత్రమునకు ముందు వచ్చుచుండెను. మధ్వాదినామములు క్రీ. పూ. దాదాపు 2000 వత్సరములైయున్నవి (పైగ్రంథము, లే 146) ఆసమయమున మార్గశీర్షమందు వసంతములేకుండెను; కాన వసంతారంభము బహుధా వైశాఖమున నగుచుండియుండును. ఆసమయమున మార్గశీర్షాదిమాసగణన పూర్ణిమనాఁటి మృగశీర్ష నక్షత్రముతోనయి యుండు ననియు ఊహింపఁగలదు; కాని యీవిషయమై యధికముగాఁ జర్చించు నావశ్యకతలేదు.

ఈవిధముగా భగవద్గీతాకాలము క్రీ. పూ 2000– 290 మధ్యవర్షముగా నిశ్చితమగుచున్నది. ఇదియొకవేళ యొకానొకనికి నసంభవమని తోఁచ వచ్చును, అయినను ఇట్లూహించుటకుఁ గారణమేదియులేదు. చూడఁగా శత పథబ్రాహ్మణముయొక్క కాలము క్రీస్తుకంటె 0L0ను భారతీయయుద్ధకాలము క్రీస్తుకంటె 3101 యేండ్లపూర్వమైయున్నది. అట్టిచో భగవద్గీతకుఁ బై చెప్పఁబడినకాలమే నిశ్చితమనుటలో నాశ్చర్యమేమియును లేదు భారతీయ యుద్ధముతరువాతనే వ్యాసుఁడు తనభారతగ్రంథమును రచించెననియు భగవద్గీత మూలభారతములో నుండెననియు విశ్వసింతుమేని, యపుడుకూడ దానియొక్క కాలము బహుప్రాచీనమై యుండవలయును. * 2 నిశ్చితమైన యీకాలము విషయమున నితరవచనములనుండి యెటువంటి బాధవచ్చునో యిపుడు మనము చూతము. భగవద్గీతయందు వ్యాకరణవిషయకములైన కొన్నివచనములున్నవి, "అక్షరాణామకారోస్మి ద్వంద్వః సామాసికస్యచ" ఈ వాక్యమందు వ్యాకరణ విషయకమైన యుల్లేఖము కలదు ఇందుచేత భగ వద్గీత పాణినికిఁ బిమ్మటిదనిచెప్పుటకు నావశ్యకతలేదు పాణినియేమాత్రము ఆద్యవ్యాకరణకర్త కానేరడు. యథార్థమున వ్యాకరణాభ్యాసమైతే వేదకాలము

---

* ఇచటఁ గొంచెము కను స్పష్టము చేయవలసియుండును. ఐతిహాసిక ప్రమాణముల విచారింపఁగా భారతీయయుద్ధకాలము క్రీ పూ. 3101 వత్సరము నిశ్చితమగుచున్నది. 'మాసానాం మార్గశిర్షోహం ఋతునాం కుసుమాకర

నుండియే వ్యాపకమై యుండెను. ఛాందోగ్యోపనిషత్తునందు స్వరముయొక్క భేదములు చెప్పఁబడియున్నవి మరియు ఉచ్చారణమెట్లు చేయవలయునో చెప్పబడియుండెను. "సర్వేస్వరా ఇంద్రస్యాత్మానః సర్వే ఉష్మాణః ప్రజాపతేరాత్మానః సర్వేస్పర్శా మృత్యోరాత్మానః" ఇత్యాదివర్ణనము ఛాందోగ్యము ప్రపాఠికలోనున్నది. అనఁగా వ్యాకరణముయొక్క యభ్యాసము నామమును బహుప్రాచీనములై యున్నవి. అప్పుడు, వ్యాకరణ పారిభాషికములయిన అకారము, ద్వంద్వము, సామాసికమువంటి కొన్నిశబ్దములు భగవద్గీతయందుఁగనఁబడుటలో నాశ్చర్యమేమియునులేదు. భగవద్గీత ఛాందోగ్యబృహదారణ్యకాద్యుపనిషత్తులకుఁ బిమ్మటిదనుట మన్నింపఁదగియుండెను. కాని యుపనిషత్తులయొక్కయు వాని బ్రాహ్మణములయొక్కయుఁ గాలము చాల పూర్వమని నిశ్చయమగుచెడలఁ బైనిజెప్పినట్లే భగవద్గీతాకాలము నిశ్చితమగుటలో నేమియు నాశ్చర్యముచేదు. వైదికకాలముయొక్క మర్యాద మాత్రము చాలపూర్వమునకుఁ బోవలయునను మనము మునుపు చెప్పియుం

ఈవాక్యమువలన భగవద్గీత క్రీ. పూ. ౬000 నుండి 1410 ఏండ్ల మధ్యకాలములోనిదని నిశ్చితమగుచున్నది. ఇచ్చట నీప్రశ్నము బయలుదేరుచుండెను. భగవద్గీత భారతీయయుద్ధమునాటి వ్యాసునిదే యని యెట్లుచెప్పఁబడఁగలదు? కనుకనే మనము భగవద్గీతను వ్యాసునిది లేక వైశంపాయనునిది యని చెప్పుచున్నాము. మనమతమున భారతీయయుద్ధకాలము మార్పఁబడఁజాలదు. భారతీయయుద్ధమునుండి మరియు ఋగ్వేదరచన లేక వ్యవస్థ నుండి వ్యాసుని వేఱుగాఁగూడఁ జేయఁజాలము. అపుడైతే, వైశంపాయనుఁడు వ్యాసునికిఁ బ్రత్యక్షము శిష్యుఁడు కాఁడు, ఇఁకనేమంటే వ్యాసునికిఁ గొన్ని శతాబ్దులకుఁ బిమ్మటనయి యుండును అనియే తలంపవలయును. వైశంపాయనుఁడు మహాభారతమును జదువఁగా నేను వింటినని సౌతిచెప్పుచుండెను; కాని మనము సౌతి వైశంపాయనునికిఁ గొన్ని శతాబ్దులతరువాతివాఁడని కనుగొంటిమి ఇదేన్యాయమునుబట్టి వైశంపాయనుఁడు గూడ వ్యాసునికిఁ గొన్ని శతాబ్దముల పిమ్మట వాడైయుండునని విశ్వసింపవలసియుండును. మనకు వ్యాసులయొక్క భారతము లేక వారియొక్క ప్రత్యక్ష శబ్దములు వైశంపాయనుని ముఖమునుండియే వినుపించుచున్నవని చెప్పుటయు నిచ్చట యుక్తముగానుండెను.

టిమి. దానిని వెనుకకుఁ దీసికొనిపోక యీవలివయిపునకు లాగెడు పాశ్చాత్యుల ప్రవృత్తి సర్వథా భ్రమపూర్వమైయుండెను. వేదాంగజ్యోతిషము శతపథము వీనియొక్క కాలము సునిశ్చితములయిన జ్యోతిర్విషయకోల్లేఖములచేత నితరప్రమాణములచేత మాత్రము క్రీ పూ. 1400– 000 మధ్యవత్సరము నిశ్చితమగునేని యట్లే భగవద్గీతాకాలముకూడఁ బూర్వమని విశ్వసింపవలయుననుట స్పష్టమైయుండెను. అగుఁగాక; వేర్వేరుగ్రంథముల కాలము వాదగ్రస్తమనికూడ విశ్వసింపఁబడునేని యపుడును నక్ష్యమాణగ్రంథముల పరంపర యుండు, మనకు మాత్రమే సంశయముమాత్రము లేకుండుటగాక మన మూహించునంతవఱకు మఱియెవరికిని సంశయముండనేరదు. ఈవిషయమై ప్రాయికముగా నందఱును మనతో నేకీభవింతురనియే మనమూహించున్నారము. ఆపరంపర యిట్లున్నది:– అన్నిటికంటె ముందు ఋగ్వేదసంహిత యొక్క రచన, తరువాత భారతీయయుద్ధము, తదనంతరము శతపథ బ్రాహ్మణములోని మొదటి పదిఖండములు, వీనియనంతరము బృహదారణ్యాది దశోపనిషత్తులు పిదప భగవద్గీత, అంతట వేదాంగజ్యోతిషము, యాస్కుని నిరుక్తము మరియుఁ బాణినివ్యాకరణము; పిదదనంతము వర్తమాన మహాభారతము, తదనంతరము పతంజలియోగసూత్రములు అట్లు బాదరాయణుని వేదాంతసూత్రములు. ఈవిధముగాఁ బ్రాచీనగ్రంథములయొక్క పరంపర స్థిరమగుచుండెను. ఈగ్రంథములలోని భిన్నభిన్నస్థలముల వివేచనఁబట్టి పాఠకులధ్యానయమునకు, ఇపుడుపలబ్ధములైన సాధనములయొక్క పరస్థితి నీపరంపర సరియైనదని నమ్మిక శీఘ్రముగా రాఁగలదు. పతంజలి మహాభాష్యముఁబట్టి పతంజలియొక్క కాలము క్రీ. పూ, దాదాపు 150 వత్సరమని నిశ్చితమగుచున్నది, ఇదే లెక్కనుబట్టి యితరగ్రంథములయొక్క కాలము పూర్వముకంటె మిగుల (బూర్వ [పూర్వాతిపూర్వ]మని విశ్వసింపవలయును.

## భగవద్గీతయొక్క భాష.

భగవద్గీతావిషయమున నింతవఱకు మనము గ్రంథము, కర్తకాలము వీనివిషయమై వివేచించితిమి. ఇపుడు మనము భగవద్గీతలోని భాషవిషయమై కొంచెమెక్కువగా విచారింతము. మహాభారతములోని భాషకంటె భగవద్గీతా

భాష మిక్కిలి సరళము, శక్తిమంతము గంభీరమునయి యున్నదని మనము వేరొకచోఁ జెప్పితిమి కాలసృష్టిచేత భగవద్గీత యుపనిషత్తులకుఁ దరువాతిదియు దగ్గఱదియు నయినట్లే భాషాదృష్టిచేతఁ గూడ వానికనంతర సన్నిహితమై యగుపడుచున్నది. ఈభాషయందుఁ గ్రియలయొక్క పూర్ణ్వము లయిన ప్రయోగములు తఱచుయందు వచ్చుచున్నవి. ధాతుప్రత్యయము యొక్క ఉపయోగము కనఁబడకుండెను. సమాసములోని పదములుమిక్కిలి కొలఁదిగను జిన్నవిగను నున్నవి. వివేచనమంతయు వ్యావహారిక భాషతోఁ దుల్యమగు సరళమైన భాషయందు గూఢార్థరహితమై యుండెను. మహాభారతములోఁ జాలచోటులను గూఢార్థ శ్లోకములు కలవు, ఇంతియేగాక పెక్కుచోట్లను గూఢార్థకమైన శబ్దములుకూడఁ బ్రయోగింపఁబడియుండెను. వ్యవహారభాషయందట్టి శబ్దములెన్నఁడు నుపయోగింపఁబడుచుండ వనుట స్పష్టమైయుండెను. మహాభారతములోఁ దత్త్వజ్ఞానవిషయకమైనయే యుపాఖ్యానమందును సరళము ప్రసాదగుణయుత్తమునయిన యిట్టిభాషలేదు. శాంతి పర్వములో ననేకములయిన తత్త్వజ్ఞానవిషయక సంభాషణములను, ఆఖ్యానములను, సనత్సుజాతీయమును లేక ధర్మవ్యాధ సంవాదమును బఠించునపుడు విషయములయొక్కయు భాషయొక్కయుఁ గ్లిష్టతయనుభవమగుచుండెను కాని భగవద్గీతయందు నిట్టిగ్లిష్టతయేమాత్రమును లేదు. విషయమును సూక్ష్మముగా వెదికి యందలి భిన్నభిన్నాంశములను, భేదములను మరియునపరిపక్వములయిన విభాగములను జేయునట్టి ప్రవృత్తియు భగవద్గీతయందునగపడదు. ప్రతివిషయము గీతయందు నుపనిషత్తుల్యముగనే ప్రతిపాదింపఁబడియున్నదని బుద్ధిమంతుఁడయిన పాఠకునిధ్యానమునకు నవశ్యముగా రాఁగలదు; ప్రతివిషయముయొక్క కథనము వ్యాపకదృష్టిచేత ముఖ్యసిద్ధాంతముమీఁద ధ్యానముంచి చేయఁబడియున్నది, నిరర్థకముగా నెక్కువ విస్తరించికాని సూత్రరూపమున సంగ్రహించికాని లేదు. ఉపనిషత్తులయందు వక్తృత్వ పూర్ణమైన భాషయొక్క ఛాయయెట్లు మనస్సుపైని బడుచున్నదో, యట్లే భగవద్గీతయందును భాషయొక్క వక్తృత్వ దృష్టిగోచరమగుచున్నదనుట యన్నిటికంటె నెక్కువగా ధ్యానింపఁదగిన విషయమై యుండెను. మృతభాషయందు వక్తృత్వమెన్నఁడు నుండఁజాలదనుసంగతి ధ్యానములోనుంచుకొనవలయును మస్తిష్కములో విషయము నిండినపుడు

సహజస్ఫూర్తియొక్క ప్రవాహము జీవితభాషామార్గముననే చక్కఁగా వ్యాపింపఁగలదనుసంగతి యత్యంతము స్వాభావికమైయుండెను. కనుక సంస్కృతభాషజీవించియున్నప్పుడే భగవద్గీత రచింపఁబడి యుండునని మనమతమై యుండెను। దీనికి సంబంధించిన విచారము కొంత యిచ్చట చేయవలసియుండెను. మహాభారతగ్రంథము చేయఁబడినప్పటికి సంస్కృతభాష మృతమైయుండెననుట నిర్వివాదమైయున్నది. ఇతిహాసముమీఁద దృష్టిప్రసారము చేయుటవల్ల, బుద్ధునికాలమున అనఁగా క్రీస్తుకంటె దాదాపు 500 ఏండ్లకు మునుపులేక యీసమయమున గొంచెమింకను మునుపు సామాన్యజనసమూహముయొక్క వ్యవహారభాష సంస్కృతము కాకుండెనని మనము చెప్పగలము పాణిని క్రీస్తువత్సరముకంటె దాదాపు 800-900 ఏండ్లకుఁ పూర్వముననుండెను. ఆసమయమందు లోకులందఱును సంస్కృతభాష మాటాడుచుండిరి. పాణిని సమయమున సంస్కృతము, అనుపదములే కాకుండెను. అతఁడు 'సంస్కృత' మునకై 'భాషా' శబ్దము నుపయోగించియున్నాఁడు. అనఁగా పాణినిసమయమున సంస్కృతభాష జీవించియుండెనని మనము చెప్పఁగలము. భగవద్గీత పాణినికి వేయిలేక యెనిమిదివందల యేండ్లకుఁ పూర్వమున వ్రాయఁబడియున్నదని మనము నిశ్చయించి యున్నాము. అనఁగా పాణినీయవ్యాకరణదృష్టిచేత భగవద్గీతయందున్న యుప ప్రయోగముల పరిశుద్ధములని తలపఁగూడదు. వానిని దప్పులనిచెప్పుట నేటివ్యాకరణము నాధారముచేసికొని యాంధ్రభారతమునఁ దప్పులెంచుపనికి సరిగా నుండును. అట్లని పాణినీయము నాధారముచేసికొని దశోపనిషత్తులందును దప్పులు చూపఁబడఁగలవు. కఠోపనిషత్తులోని మొదటియధ్యాయమునే తీసికొనుఁడు. పాణిని ననుసరించి యిందలి 'ప్రతేబ్రవీమి' [తమమేనిబోధ] అనుపదములలో 'ప్ర' వ్యర్థమని చెప్పఁబడును. ఇట్లే 'ప్రసహ్య ధర్మమణుమేత మాప్య' ఇందులోఁ ఆప్య' అనుదానియొక్క ప్రయోగము, 'నాచికేతం శకేమహి, ఇందులోఁ శకేమహి, యొక్క ప్రయోగము, అయుక్తములు. గూఢోత్మాన ప్రకాశతే, ఇందలి గూఢోత్మా. అపసంధియై యున్నది. సారాంశము, భగవద్గీత పాణినికిఁజాల మునుపటిదియై యుండెను, ఇందుచేత దానిలోనిభాషను కేవలము పాణినీయవ్యాకరణదృష్టితోఁ జూచుట యుక్తముకానేరదు. మనయాలోచనలో దశోపనిషత్తుల భాషవలెనే భగవద్గీతాభాషయు స్వతంత్రమును మిక్కిలి సరళమునై యున్నది.

భాషాశాస్త్రమునెఱింగినవారు రెండువందలు లేక నాలుగువందలు వత్సరములతరువాత భాషయందు భేదము తటస్థించుచున్నదని చెప్పుచున్నారు. ఈసంగతి మరాటీ హిందీ ఆంధ్రభాషల యితిహాసముబట్టి మనకుఁ బ్రత్యక్షమగుచుండెను. ఇట్లని మహాభారత భగవద్గీతలయొక్క భాషయందు నింతభేదమెందులకుఁ గానిపింపదు? కాని భాషాశాస్త్రజ్ఞులిచటఁ బ్రశ్నించుచున్నారు. నిస్సందేహముగా నియ్యది విచారణీయమై యుండెను. పాశ్చాత్యపండితులు వైదిక సాహిత్యమునంతకు సన్నిహితభూతకాలికమని చెప్పుకారణములలో నొకకారణమిదికూడనయియున్నది. వారికల్పన బొత్తిగాఁ బొరపాటని చెప్పఁజాలనప్పటికిని మనము రెండుమూఁడు విషయముల మీఁద నవశ్యము ధ్యానముండవలసియుండును. భాష మృతమైనపుడు దానిస్వరూపము బొత్తిగా మాఱదనునది యందొకటియైయున్నవి. ఆభాష కేవలము పండితులు మాటాడునదియు వ్రాయునదియునయి యేర్పడుచున్నది మరియు నట్టిభాషయందు నేదియుత్తమవ్యాకరణమూ దానిననుసరించియే వాగ్వ్యవహారమంతయు జరుగుచున్నది. ఆభాషకు సరియైన వ్యాకరణము లేనియెడల నట్టిభాషమృతమైన తరువాతఁ దిరుగా వ్రాయఁబడుటయు జరుగవనుటస్పష్టము. ఏభాషలు సంస్కరింపఁబడి వానికి వ్యాకరణమేర్పడునంతటి యున్నతావస్థకుఁ జేరుచున్నవో, యవియే మృతావస్థయందును బండితుల వ్యాసములలో జీవించియుండును. ఇటువంటి పండితులకు వ్రాయఁగా వ్రాయఁగా వేలకొలఁది వత్సరములు గడచిపోయినప్పటికిని లేఖ న్ప్రణాలి యందు నంతరమేమియునుండదనుట స్పష్టము. ఉదాహరణార్థము, లేటను భాషయందు గ్రంథరచన కేవలము మిక్కిలి బేకను వఱకేగాక యిప్పటివఱకునున్నది. అనఁగా లేటను భాష మృతమైపోయిన తరువాతఁ గూడ 200..600 వర్షములవఱకు నయ్యది బడుచున్నది. ఇంతియేగాక, అందు గ్రంధరచనాకారకుని మిల్టను లేటను భాషలోఁ బ్రసిద్ధకవియైన వర్జిలుతో సమానముగా భాషను వ్రాయుచుండెనని కొనియాడఁబడుచుండెడివాఁడు. ఇంతియే సంస్కృతభాషకుఁ గూడనయియున్నది. లోకులవ్యవహారము (సంభాషణము) నుండి సంస్కృతము తొలఁగిపోయినపిమ్మట సౌతి మహాభారతమును నిర్మించెను, అంతమాత్రము చేత నాతనిభాషయందును భగవద్గీతాభాషయందును నెక్కువ యంతరము కాఁజాలదు. గ్రంథకారుఁడెంత విద్వాంసుఁడగునో, వానిభాషయనంతయేపూర్వ

కాలికములైన గ్రంథములకు సదృశమై యుండుననుటలో సందేహముండదు. అందుచేతఁ బాణినీయ వ్యాకరణము తరువాత నట్టి బుద్ధుని యనంతరమున నెంత సంస్కృతసాహిత్యమున్నదో, మరియు నెయ్యది యుత్తరయున్న కారనముచేత నేఁటివఱకు నిలిచియున్నదో, యయ్యది చాలవఱకుఁ బాణినిభాష ననుసరించియే యున్నదనుట నిర్వివాదమైయున్నది. అందుచేతనే సంస్కృత సాహిత్య భాష యందు విశేషభేదము మనకుఁ గానిపింపదు, అందు భాషావృద్ధికిఁగల సిద్ధాంతము విశేషాంశమునఁ బ్రయుక్తము కానేరదు.

రెండవసంగతియేమనఁగా :- ఏభాషకు వాకరణము రచింపఁబడియుండదో, యాభాషమిగులఁ దొందరగా మార్పుచెందుచున్నవి; మరియు నేభాష ప్రౌఢ మగుచున్నదో దేనికి వ్యాకరణము విరచింపఁబడియున్నదో, విశేషముగా దేనికి నిఘంటువుకూడఁ జేయఁబడుచుండెనో, దానియందు మెల్లమెల్లగా భేదము కలుగుచున్నది, ఒక్కమారుగానేఁదు. భాష హెచ్చుటకుఁగాని తగ్గుటకుఁగాని యింకను ననేక కారణములు కలవు. అవి విస్తరభయమున నిచట బేర్కొనఁబడఁజాలవు. ఈయన్ని విషయముల దృష్టిచేతను సంస్కృత భాషను జూడవలయును. ఋగ్వేదమునాఁటి భాష బ్రాహ్మణమునాఁటి భాష కంటె వేఱయియుండెను అపుడును నధికాంశమున నయ్యది దుర్బోధమై యుండెను. ఇంతేకాక బ్రాహ్మణములలోఁ బ్రతిచోటను ఋగ్వేదమందలి ఋక్కులయర్థమును జెప్పుటకయి ప్రయత్నము చేయఁబడియుండెను. బ్రాహ్మణముల భాషయందును దశోపనిషత్తుల భాషయందును నంతరము కనఁబడుచుండెను, కాని యంతయెక్కువగా మాత్రములేదు; ఎందుచేతననఁగా బ్రాహ్మణములనాఁడు వ్యాకరణముయొక్కయు నిఘంటువుయొక్కయు నభాసమారంభమైయుండెను. వ్యాకరణ నియమములనేక మన్వేషింపఁబడి తయారుకూడఁ జేయఁబడియుండెను. ఉపనిషద్భగవద్గీతలు రెండిటిభాష యందును గలిగియున్న కొంచెపాటి యంతరమునకుఁ గారణముకూడనయ్యదియే యైయున్నది; అట్లే భగవద్గీతా పాణినీయముల భాషయందును గొంచెభేదముండెను. ఈయవధిలో భరతఖండముమీఁద నెవరయినను విదేశీయుల దండయాత్ర జరిగెనో లేక యేదేని మరియొకభాషయొక్క ప్రభుత్వమయ్యెనో ఈవిషమైయ్యెనో యిదివరకటి యితిహాసమేదియుఁ గనఁబడదు.

అనఁగా భాషయందుఁ బ్రారంభమున శీఘ్రముగా మిగులనధికమైన భేదము కాదయ్యెను. ఈదృష్టిచేతఁ జూడఁగాఁ బాశ్చాత్యులైన భాషాశాస్త్రకారులు భాషయందు భేదముసంభవించుటకయి యేయవధిని రెండువందలయేండ్లని చెప్పుచున్నారో యది యెన్నటికిని నిజము కానేరదు. ఈకాలమింకను నెక్కువ కావలయును. వేదాంగజ్యోతిషమందును పాణినీయభాషయందును విచారింపఁగా నధికభేదములేదు, అయినను వీనికాఱువందలయేండ్ల యంతరమున్న దని నిశ్చయముగాఁ జెప్పఁబడఁగలదు. ఈదృష్టిచేత భగవద్గీతాభాషయందును పాణినీయభాషయందును నెనిమిదివందలయేండ్ల యంతరమును విశ్వసించుట యసంభవముకాదు.

యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే ।
ఏవం సర్వాణి భూతాన్యగ్నిహోత్రముపాసతే ॥

ఛాందోగ్యోపనిషత్తునందలి యీ శ్లోకమును జదించి చాలమందిలోకులు అది సంస్కృతభాషలో నుత్తమమైన శ్లోకమనియు, అదియింత ప్రాచీనమెట్లు కాఁగలదనియుఁ బలుకుచుండిరి. కాని పైని జెప్పినవిషయములన్నిటిమీఁదను వారు ధ్యానముంచవలసియున్నది. ఒకసంగతి యేమనఁగా, క్రీస్తుకంటె 60 ఏండ్లకు మునుపు సంస్కృతభాషకు మాటలాడుటయందుఁ బ్రచారము సామాన్యముగాఁ గట్టువడిపోయెను, ప్రసిద్ధమును వైదికులచేత మన్నింపఁదగినదియునయిన పాణిని వ్యాకరణమువలన దానికి లభించిన స్వరూపము రెండున్నరవేల సంవత్సరములనుండి యిప్పటిదనుక స్థిరమైయుండెను. అంతకుఁ బూర్వము వేదాంగకాలమందు భేదము లేదయ్యెను; ఎందుచేతననఁగా, భాషయందనేక వ్యాకరణములుత్పన్నములై వానిచేత దానియొక్క స్వరూపము చాలవఱకు స్థాయియైయుండెను. అయినను దశోపనిషత్తుల భాషయందును వేదాంగములనాఁటి భాషయందును గొంచెము భేదమున్నది. ఈభేదము వేయిది లేక యెనిమిదివందల సంవత్సరములదియుఁ గాఁగలదు. భగవద్గీత యీ మధ్యకాలపుదియై యుండెను దానిస్వరూపము పూర్తిగా మాటలాడెడి భాషదియైయుండెను. సమస్త మహాభారతములోని

భాషకువలెఁ గృత్రిమస్వరూపము కానిపింపదు. భగవద్గీతయందలి విషయప్రతిపాదనశైలియు భాషయొక్క వక్తృత్వము వ్యవహారములో జీవించియున్న భాషవిధమైయున్నవి. మరియు నయ్యది విశేషముగా ఛాందోగ్యమునకును బృహదారణ్యకోపనిషత్తులకును సమానమైయుండెను భాషాదృష్టిచేతఁగూడ మనము భగవద్గీతను ఉపనిషత్తులకుఁ దరువాతిదిగను వేదాంగములకు లేక యాస్కునికిఁ బక్షాంతరమునఁ బాణినికి మునుపటిదిగను విశ్వసించియున్నాము. మనమిట్లు విశ్వసించుట యనుచితము కాదని చెప్పుటకాతంక మేదియు లేదు.

## భగవద్గీతాకాలమందలి పరిస్థితి.

ఇపుడు మనమీ విమర్శముయొక్క యంత్యప్రశ్నముపై ధ్యానమునుంచెదము. మనమీప్రశ్నములను విచారించుట యావశ్యకమైయున్నది. ఏవి యనఁగా, భగవద్గీతయందు శ్రీకృష్ణునియొక్క యేవిష్టమతములు మనకుఁ గనఁబడుచున్నవి? శ్రీకృష్ణుని చరిత్రమందును భగవద్గీతయందును నీయఁబడి వానికి సంబంధించిన విచారములయందుఁ గలయికయుండెనో లేదా శ్రీకృష్ణుని చరిత్రము, భగవద్గీతయొక్క పరమతత్త్వము రెండునునెట్లుచ్చతమములును దాత్తములునయి యున్నవి? భగవద్గీతయందు ముఖ్యముగా ఏవిషయము ప్రతిపాదింపఁబడియుండెను? అందులకై మనము శ్రీకృష్ణుని నాఁటిపరిస్థితికిని భగవద్గీతనాఁటి పరిస్థితికిని కొంచెము మునుపటి స్వరూపమును ధ్యానములోనికిఁ దీసికొనిరావలయును. కృష్ణావతారసమయమునను భారతీయార్యులు హిందుస్థానములోని పంజాబు, మధ్యదేశము, అయోధ్య, సౌరాష్ట్రము మొదలైన ప్రాంతములయందు నివసించియుండిరి; వారియొక్క యుత్తమమైన ధార్మికవ్యవస్థచేత వారికన్నివిధములఁ యౌన్నత్యమును సంభవించియుండెను. దేశమునందు క్షత్రియులసంఖ్య మిక్కిలి పెరిఁగియుండెను. అక్కడక్కడ మంచిమంచి రాజ్యాలు స్థాపితమైయుండెను. వ్యవహారపరిస్థితియుఁ జక్కఁగా నేర్పాటై యుండెను, కాఁబట్టి దేశమంతయుఁ బ్రజావృద్ధితో నిండియుండెను. దక్షిణమునను దూర్పునను ద్రవిడదేశములందు ద్రావిడుల సంఖ్య సంపూర్ణముగా వృద్ధినొందెను అక్కడ నింకముందు

నకుఁ బోవుటకై చోటులేకుండెను. లోకులెక్కువ నీతిమంతులగుటచేతఁ దమలోఁదమకు వైరభావము లేక యనారోగ్యము తక్కువగానుండెను. అనఁగా నిన్న మొనమొన్న మహాయుద్ధమునకుఁ బూర్వము యూరోపుదేశముల స్థితియెట్లుండెనో, అట్లే కొంచెమధికమైన స్థితి శ్రీకృష్ణుని జన్మసమయమందునయి యుండెను. భూమికి బరువెట్లు తగ్గునని బ్రహ్మ చింతిల్లినట్లు చేసిన వర్ణనము కొంచెమైన నసత్యము కానేరదు. ఇటువంటి సమయమున శ్రీకృష్ణుని యవతారమునకును నాతని దివ్యోపదేశమునకు నెంతయెక్కువ యావశ్యకత యుండెనో విస్తరించి మనము ముందు చెప్పఁగలము.

## రాష్ట్రములయొక్క యుచ్చములు నీచములునయిన గతులు.

ఏదేశమును బరమోచ్చమైన స్థానమున నెల్లపుడు నుండఁజాలదు. ఉన్నతమైన శిఖరమునకుఁ జేరినపిమ్మట, తిరుగుచున్న చక్రముక్రిందివైపునకు వచ్చుట తప్పనియట్లే యుచ్చనీచగతులయొక్క విధము, ఈప్రపంచమునందు, ఎప్పటికిని సంభవించుచునేయుండును. ప్రస్తుతకాలమందు నాగరికతా శిఖరమునధిరోహించిన యూరోపమహాద్వీపమున నొక్కమనుష్యుని దురాగ్రహము కారణముచేత భయంకరమైన సంగ్రామము వ్యాపించినట్లే నీతి, శౌర్యము, విద్య మున్నగు వానియందుఁ జక్కఁగా సంస్కరింపఁబడి పరమోచ్చస్థానమునకుఁ జేరిన ప్రాచీనభారతవర్షమును, శ్రీకృష్ణుని సమయమందును ఒక మనుష్యుని మూర్ఖపుపట్టువలన భయంకరమైన యుద్ధమున కవసరము తటస్థమయ్యెను. ఆయుద్ధమునుబట్టి భారతవర్షమునకు హీనదశ యారంభమాయెను. భారతీయ యుద్ధమునుండి కలియుగముయొక్క యారంభమయ్యెననియు యుద్ధమందే కలియుగ బీజమున్నదనియు మత నిశ్చితాభిప్రాయము. వేలకొలఁది మాత్రమేగాదు, లక్షలకొలఁది మనుష్యులు తమ శూరత్వము విద్యయుఁ గారణముగాఁగా ఆయుద్ధములోమరణించిరి. దేశములోని ప్రజాసంఖ్య తగ్గిపోయెను. ఒకదృష్టిచేత నిద్యుది కొంచెము లాభదాయకమైనను మరియొక దృష్టిచేత దుర్బలత్వయు దానిననుసరించిన యనీతియొక్క వర్చస్వము దేశమందు మెల్లమెల్లగా వ్యాపింపఁదొడఁగెను.

భారతీయార్యగణము బొందిన పరమోచ్చపదముయొక్క లోపమునుగురించి కొంచెమధికమైన మీమాంస చేయవలసియుండెను; ఎందుచేతననఁగా ఇందే శ్రీకృష్ణుని దివ్యచరిత్రయొక్కయు నుపదేశముయొక్కయు రహస్యముదాఁగియున్నది.

## ప్రవృత్తి నివృత్తులకు నుచితమైన యుపయోగము.

ఏదేశమునకుఁగాని యన్నివిధములను సామాజికము, నైతికము, ధార్మికమునయిన యున్నతి కలుగవలయునన్నచో ఆదేశపు ప్రజలయందుఁ బ్రవృత్తి నివృత్తులు రెండిటియొక్క యుపయోగము యోగ్యమగురీతిని గావలయునను సంగతి యెక్కువ విశేషించి చెప్పవలసిన యావశ్యకతలేదు. ఈవృత్తులను యధాయోగ్యముగా స్వీకరించుటలో భేదము సంభవించునేని సమాజము హీనావస్థవైపునకు వంగిపోవుచున్నది. ఎపుడయితే సమాజము కేవలము ప్రవృత్తిపరాయణమై యుండునో, లేక యుందుఁగేవలము నివృత్తియొక్క యాడంబరమెక్కువగా నుండునో, లేక శుష్కమైన నివృత్తియనెడు దురూహలోఁ బడిపోవునో యపుడాసమాజ మధోగతిపాలగుటకు మొదలిడుచున్నది. ఏసమాజములేక వ్యక్తి భౌతిక సుఖమందు లిప్తమైపోవుచున్నదో దానికధోగతి యవశ్యంభావియగును. దీనికి విపరీతముగా నిచ్ఛారహితమైన లేక యాహారరహితమైన యవస్థయందు నుండుట సమాజమునకు లేక వ్యక్తికి సంభవము కానేరదు. సారాంశము, తన యౌన్నత్యమునకయి యాధ్యాత్మికాధి భౌతికములనెడు రెండుగుణములను యుక్తముగా మనుష్యుఁడుపయోగించుకొనుచుండవలయును. ఆసమయమున భారతీయార్యులయందు ఉత్సాహము, తేజము, ఉద్యోగము, సాహసము మొదలయిన ఆధిభౌతికములు లేక ప్రవృత్తియొక్క సద్గుణములయిన ధర్మము, నీతి, తపము, అనాసక్తి మొదలయిన యాధ్యాత్మికములు లేక నివృత్తియొక్కసద్గుణములు సమానముగానుండెను. మరియు ఇందుచేతనే వారాసమయమున నున్నతి యనెడు పరమోచ్చమగు శిఖరమునధిష్ఠించి యుండిరి. కాని భారతీయ యుద్ధసమయమందు ఈగుణములయొక్క సమానతలోఁ గొంచెము భేదము తటస్థమయ్యెను. ఒకవైపునఁ బ్రవృత్తియొక్క ప్రాబల్యము రెండవవైపున

నివృత్తియొక్క అడంబరము కానారంభించెను. ప్రవృత్తి ప్రాబల్యముయొక్క మొదటి పరిణామము లోభమైయున్నది. ఇటువంటి సమయమున మనుష్యుని యందునుండీ జగత్తులోని ప్రతివస్తువు తనకు లభింపవలయుననెడి యిచ్ఛ పుట్టుచున్నది. జగత్తునందు ధనమెంతయున్నదో, యెంతభూమియున్నదో యెన్నిరత్నములున్నవో యవన్నియుఁ దానివియగుఁగాకని యతఁడుతలంపఁదొడఁగెను.

యత్పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః స్త్రియః।
నాలమేకస్య తత్సర్వమితిమత్వా శమం వ్రజేత్॥

ఈప్రసిద్ధమైన శ్లోకమునందు మర్మజ్ఞుఁడైన వ్యాసుఁడిచ్చిన యుపదేశమునను సరించి, జగత్తునందలి సర్వభోగ్య పదార్థములు నొకనికే లభించినప్పటికి వయ్యవి పూర్ణముకాకయుండెను; కనుక నీసంగతి దెలిసికొని మనుష్యుఁడు శమప్రధానమగు వృత్తితోనుండుట యుచితమైయున్నది. కాని యీవిచారము లోకులహృదయమునుండి, విశేషించి రాజలోకము హృదయమునుండి వేరయిపోవుచున్నది. మరియు వారికి సర్వవిధముల నుపభోగ్యమైన వస్తువులకు జననియైన భూమి మనదియగుఁగాక యని తృష్ణలగ్నమగుచుండెను. ఈయాశకుఁ బిమ్మట మెల్ల మెల్లగానితర దుష్టాలోచనయొక్క ప్రచారము సమాజమునందుఁ గానారంభించుచుండెను. మహత్త్వాకాంక్ష కపటము, అన్యాయము మొదలగు రాక్షసములయిన దుర్గుణముల సామ్రాజ్యమారంభమగుచుండెను. మరియు నంతమున వైరముత్పన్నమై సమాజము లేక రాష్ట్రము నశించిపోవుచున్నది.

## భారతీయయుద్ధకాల పరిస్థితి.

భూభారము తగ్గించుటకును తదనుసారముగా భారతీయార్యులను నశింపఁజేయుటకును, విధాతఆర్యభూమియందు లోభబీజమును మొలవయిచెను మూఁడుస్థానములయందు నాశమునకుఁ గేంద్రస్థానముల నేర్పఱచెను. కంసుఁడు, జరాసంధుఁడు, దుర్యోధనుఁడు ననెడి లోభులు మహత్త్వాకాంక్షులు

నయిన మూఁడువ్యక్తులనుత్పాదించి యతఁడు తనయిష్టకార్యము నెఱవేర్చుకొనెను. లోభ, మహత్త్వకాంక్షలలో నధికముగాఁ జిక్కుకొని, కంసుఁడు, ఔరంగజేబువలె, (దండ్రిని జెఱసాలలోఁ బెట్టి రాజ్యమును లాగుకొనెను. ఈ దుష్కార్యమును సమర్థించుకొనుటకయి యతఁడు తన తండ్రి పక్షమువారిపై నత్యాచారములను గావించెను. వందలకొలఁది క్షత్రియులను జెఱలోఁబడవయిచెను. జరాసంధుఁడు పరమైశ్వర్యప్రాప్తికొఱకు వారిచేతఁ బురుషమేధమును జేయుటకాలోచించెను. దుర్యోధనుఁడు పాండవుల సంపదను రాజ్యమును జూదమున లాగుకొనెను, ప్రతిజ్ఞానుసారముగాఁ దిరిగియిచ్చివేయవలసినసమయము వచ్చినపుడు సూదిమొన మోపఁగానెడలు నంతటిమట్టికూడ నేనీయనని స్పష్టముగాఁ జెప్పివేసెను. అనఁగా దారుణమైన సంగ్రామము లేచి లక్షలకొలఁది మనుష్యులు హతులయిరి. లోభమునకు బలసంపదల సాహాయ్యము దొరకినపుడు రణము లు మిగుల భయానకములగుచున్నవి; వానికిఁదోడు రెండుపక్షములును పెద్దతరగతివియమరియు శౌర్యాదిగుణములు సమానముగా నున్నయెడల నీయుద్ధములెంత హానికరములో దీనియనువము ప్రపంచమునకుఁ బ్రాచీనకాలము మొదలుకొని నేఁటియూరోపియు మహాయుద్ధమువఱకు నగుచున్నది. ఇంగ్లీషునందొక సామెతయుండెను.
When greek fights greek, then the tug of war is torrible.
ఇందుచేత భారతీయ యుద్ధమునందు 18 అక్షౌహిణులసేనకుఁ బదిమంది మనుష్యులే జీవించి మిగిలిరి. తాత్పర్యమేమనఁగా బ్రహ్మ లేక ప్రకృతి లోభరూపమైన విషబీజమును మొలవయిచి, భారతీయార్యుల నాశమునకు ప్రారంభమును జేసెను. ఈవిలక్షణ ప్రసంగమునందు శ్రీకృష్ణుఁడవతరించి యుండెనని జ్ఞప్తియుంచుకొనవలయును. ప్రవృత్తిమార్గమున కఠినులయి లోభము, మహత్త్వాకాంక్ష మీరెండిటి చేతిలోఁ జిక్కికొని, యొండొరులకు సంగ్రామము జరుగుసమయమున, నిర్లోభత్వముయొక్క యుదాత్తమైన యాదర్శమును జూపుటకును బుద్ధి, పరాక్రమము, క్షిప్రకారిత్వము మూఁడిటి చేతను సత్యముయొక్క పక్షమును జక్కబెట్టుటకును, శ్రీకృష్ణుఁడాసమయమునఁ బ్రపంచములో నుపస్థితుఁడయ్యెను. నిర్లోభవృత్తి కిటువంటి యుదాహరణము లితిహాసమందుఁ జాలఁదక్కువగా దొరకఁగలవు నిర్లోభత్వముయొక్క

కార్యమును వాసింగ్టను అమెరికాలో స్వాతంత్ర్యయుద్ధసమయమునఁ జేసి యుండెను, లేక పూర్వము యునైటెడ్‌స్టేటునకు దక్షిణోత్తరభాగములయందు దాస్యమునశింపఁజేయుటకై యిరుఁడొరులకు సంగ్రామము జరిగెను. ఆసమయమున సత్యనిష్ఠుఁడును నిశ్చితాత్ముఁడునయిన అబ్రహామ్ లింకను చేసిన కార్యముఎంటిది, కాదుకాదు, దానికంటె నెన్నిరెట్లో యుదాత్తమైన కార్యము శ్రీకృష్ణునికి రాజనీతికి సంబంధించిన గడబిడ (గందరగోళము)లో జేయవలసియుండెను, దీనిపై లక్ష్యముంచినయెడల శ్రీకృష్ణుని రాజనైతిక కార్యమహత్త్వము శీఘ్రముగాఁ దెలియఁగలదు.

## నివృత్తియొక్క నిరోధము.

ఒకవైపున నేప్రకారముగా రాజనైతిక విషయమందు శ్రీకృష్ణునికి ప్రవృత్తిపరాయణులైన లోకులసమాజమునకు నివృత్తిపాఠమును నేర్పుట యనెడు మహత్త్వపూర్వమైన కార్యము చేయవలసివచ్చునో, అదేప్రకారముగా నతనికి రెండవవైపున మిగులనేర్పుతోను జేసినదానికి విరుద్ధముగాఁ బ్రవహించుచున్న నివృత్తిప్రవాహమును గూడ బంధింపవలసివచ్చెను. ఆ సమయమున నివృత్తియందుఁ గేవలాడంబరమెట్లు కనఁబడుచుండెనో, సమస్త ధార్మికవిషయములందును లోకులకెటువంటి తక్కువ యభిప్రాయముండెనో, యీసంగతి యిచట విస్తరించి చూపఁబడుచున్నది. శ్రీకృష్ణుని సమయము ఉపనిషద్విచారముల సమయమైయున్నది. కనుక శ్రీకృష్ణునిచేత నుపదేశింపఁబడిన దివ్యమగు భగవద్గీతయొక్క సత్యమైనరహస్యము నూహించుటకై ఆసమయమున నెట్టిధార్మికకల్పనలు ప్రచలితములయి యుండెనో చూడవలసి యున్నది. ఆసమయమున ముఖ్యముగా వేదము, వేదాంతము, సాంఖ్యము యోగమునునెడి మతములు ప్రచలితములయి యుండెను; ప్రతిమతము విషయములన్నింటిని దనవయిపునకు లాగుకొనుచుండెను. విచారించిచూడఁగా ఈమతములలో నిప్పుడున్న సూత్రగ్రంథములు అపుడున్నంతవఱకు నిర్మింపఁబడియుండలేదు అయినప్పటికి నీమతములు వానిముఖ్య సిద్ధాంతములతో స్థాపితములయి యుండెను. మరియు నొకదానినొకటి నిషేధించి తనపనిని

దాను నెఱవేర్చుకొనుచుండెను. కొందఱు, ప్రతిమనుష్యుఁడును వేదోక్తము లయిన యజ్ఞయాగాది కర్మములఁజేసి స్వర్గమును బొందవలయునని చెప్పుచుండిరి. కొందఱు, "కర్మమును బొత్తిగాఁ జేయరాదు, కాని బృహదారణ్యకములోని "పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరంతి" ఈవచనముల ప్రకారముగా సంసారము విడిచి మనుష్యుఁడరణ్యమునకుఁ బోవలయునని"యు, నని చెప్పుచుండిరి. ఇటువంటి వాదము శిక్షితులయిన వారియందుఁ గలిగినపుడు బహుజనసమాజమునకు విశేషించి మిశ్రసమాజమునకు శూద్రులకును నేదియాధారమును లేకపోయెను. వారికయివైదిక కర్మముచేయుటయే సంభవింపకుండుటగాక ఉపనిషత్ప్రతిపాదితమైన సంన్యాసమార్గముకూడ వాటంకములేనిది కాదయ్యెను. అట్టిపరిస్థితియందు శ్రీకృష్ణుఁడు భగవద్గీతలోని దివ్యోపదేశమునిచ్చి యొకవైపునఁ గర్మముయొక్క యాడంబరము కానటువంటిదియు రెండవవైపున నివృత్తియొక్క, అనఁగా (శాంతమైననివృత్తియొక్క ఆడంబరము లేనటువంటిదియునయి జనసామాన్యమునకు సుగమమైన నవీనమగు భక్తిమార్గమును బ్రతిపాదించెను. సమాజమందలి యీపరిస్థితియొక్క స్వరూపము పాఠకులధ్యానమునకు సరిగాఁ దీసికొనివచ్చుటకయి యీసిద్ధాంతమును గొంచెమింకను ఐతిహాసికముగా వివేచింతము.

## వైదికులయిన ఆర్యుల స్వభావము.

ఋగ్వేదములోని యనేకఋక్కులనుబట్టి ప్రాచీనభారతీయార్యుల మానసికస్థితి వారుమొట్టమొదట హిందుస్థానమునకు వచ్చినపుడెట్లుండెనో స్పష్టముగాఁ గన్పడుచున్నది. ఋగ్వేదకాలమందలి యార్యులయందు నవీనశక్తియు నవీనావేశమును నుండెను. వారుప్రసన్న మనస్కులును, మహాశూరులును, సంసారమునందలి యుపభోగ్యవస్తువులను నుచితముగా నుపయోగించుకొనువారునయి యుండిరి. వారు ఇంద్రవరుణాది దేవతలనుండి సుందరులయిన స్త్రీలను వీరులయిన పుత్రులను శక్తిమంతములైన గుఱ్ఱములను యాచించుచుండిరి. వారు సోమరసమును ద్రాగుచుండిరి తమప్రియదేవతలనుగూడ సోమరసమును ద్రాగుటకయి పిలుచుచుండిరి. వారు మాంసమును దినుచుండిరి యజ్ఞమందుఁ బశువునుజంపి దేవతలకు

మాంసము సమర్పించుచుండిరి. వారి ముఖ్యోద్దేశము స్వర్గమైయుండెను. మరియు, ఆస్వర్గముకూడ సుఖమునైశ్వర్యమును భోగించెడు స్థానమై యుండెను. సారాంశము, మొట్టమొదటి యార్యులు ప్రవృత్తికి సంబంధించిన భోక్తలై యుండిరి, అయినను వారియందు నివృత్తిబీజము బొత్తిగా లేక పోలేదు. అనేకమైన వైదికఋక్కులయందు వారియొక్క నివృత్తిప్రధానములయిన ప్రార్థనలు మనయెదుర నుపస్థితములయి యుండుటచేత మనకిది తెలియుచున్నది. హిందుస్థానమునకు భారతీయార్యులు వచ్చినతరువాత గంగా సరస్వతులనడుమ బ్రహ్మభూమియందీ నివృత్తిబీజమువల్లనే ఉపనిషద్విచారములనెడి యత్యంతమనోహరములు రసపూర్ణమునయిన ఫలములతో శోభిల్లెడు విశాలమైన వృక్షముత్పన్నమయ్యెను. వారి సమస్తమైనవిశ్వమును నశ్వరమని కన్పెట్టెను. విస్తరమేందులకు, స్వర్గముకూడ నశ్వరమైయున్నది. ఇందువల్లనె వారియొక్క ప్రేమము తపస్సునందును వనవాసమునందును లగ్నమయ్యెను యజ్ఞముయొక్క మార్గమును వారు త్యజింపలేదు; కాని యజ్ఞముతోపాటు తపస్సునకుంగూడ వారుమహత్త్వమునిచ్చిరి. వారు స్వర్గముకంటె మోక్షమునే పరమపురుషార్థముగా విశ్వసింప నారంభించిరి. మొదట వారు సమస్తసృష్టియు యజ్ఞము చేసియుండెననియుం బ్రజాపతియు యజ్ఞము చేసియుండెననియుం జెప్పుచుండిరి. వారు, సర్వసృష్టి, ప్రజాపతి, ఇంద్రుడు సందఱును ఇంకను వారియొక్క భావన సర్వసృష్టి, ప్రజాపతి, ఇంద్రుండునందఱు తపస్సుచేయుచున్నారనియే యైయున్నది, సమస్తము లయిన యుపభోగ్య పదార్థములయొక్క త్యాగము, సర్వకర్మములయొక్క సంన్యాసము ఈరెండే మోక్షమునకుపాయములని వారికి గన్పట్టనారంభించెను. ఏదేనియొకవస్తువును గోరుటయున్న దారిద్ర్యమను స్వీకరించుట యనియు దేనింగూడ గోరకుండుట యన్నది యైశ్వర్యముయొక్క పరమావధి యనియు వారు చెప్పనారంభించిరి. సారాంశము, సంసారమును విడిచి యరణ్యమునకుంబోయి శమప్రధానమగు బుద్ధితో నిష్కామస్థితియందుండుటయే మనుష్యునికి ముఖ్యకర్తవ్యమని వేదాంతులయిన తత్త్వవేత్తలు విశ్వసింపనారంభించిరి. అధ్యాసము, మిక్కిలి దృఢతయు, విశేషమైన బలము గలిగియున్న సార్వభౌమునికి దొరకు సుఖముకంటె వేయిరెట్లధికమైన

సుఖము కామహతుఁడు, కాని శ్రోత్రియునికి దొరకునని వారినిశ్చితాభిప్రాయ మైయున్నది. ఈకల్పన వేదాంతులొకరిది కాకుండెను, స్వతంత్రరీతిని జగదుత్పత్తిని విచారించు కపిలాదిద్వైతమత వాదులకుఁగూడ నిట్టికల్పన యుండెను. మంత్రకాలమునందుఁ గర్మవాదులయొక్క ప్రవృత్తిపరాయ ణత పరమావధికిఁ బోయియుండెననియు, ఉపనిషత్కాలమందు నివృత్తి వాదుల నివృత్తిపరాయణతయొక్క శిఖరమున్నతము కానారంభించెననియు సంగ్రహముగాఁ జెప్పవలసియుండును.

సంసారమునందుఁ బ్రవృత్తి నివృత్తుల యాందోళనము.

ప్రపంచములోని యితిహాసమును చూచినయెడల మనుష్యసమాజము ఇష్ట ప్రకారముగాఁ బ్రవృత్తినివృత్తుల మధ్యమున గాలియూపుల ననుభవిం చుచు నడచుచున్నదని తెలియఁగలదు. గడియారము యొక్క పెండ్యులమువలె నయ్యది యొకమారు ప్రవృత్తియొక్క పరమోన్నతమైన శిఖరమునకుఁబోయి యచ్చటినుండి మరలి యాందోళితమై నివృత్తివైపు వంగుచున్నది; అపుడు నివృత్తియొక్క పరమోచ్చమైన బిందువునుజేరుకొని యదిమరలనాందోళితమై ప్రవృత్తివైపు తిరుగుచున్నది. నేఁటివఱకు నిట్టియనుభవము ఇతిహాసమందు సర్వత్ర కనిపించుచున్నది. గ్రీక్కులయందు హోమరుయొక్క సమయము నఁ బ్రవృత్తిప్రబలమై యుండెను. అది మెల్లమెల్ల తగ్గిపోయి పైథా గరస్సుయొక్క సమయమున లోకులు నివృత్తివైపు వంగిరి పైథా గరస్సుయొక్క యనుయాయులు మద్యమాంసములను విడుచుటయేగాక వివాహమాడుటకుకూడ శ్రేయస్కరముకాదని నమ్ముచుండిరి. డాయోజెనిస్సు సర్వసంగపరిత్యాగమును జేసి జన్మమంతయు నేకాంతవాసమును గావించు నంతవఱకు నీనివృత్తియొక్క పరమావధి యయ్యెను, ఎపిక్యూరస్సు మనుష్య స్వభావోచితమైన రీతిని దానికి వ్యతిరేకముగాఁ బోవుటకుఁ బ్రారంభించెను. సహజముగాఁ బ్రాప్తించిన సుఖములను సదాచరణముతో ననుభవించి మను ష్యుఁడానందముతోఁ దనదినములను గడపవలయునని యతనియొక్క మత మైయుండెను. మెల్లమెల్ల నీమతముకూడ, లోకులు ప్రవృత్తియొక్క రెండవకొనకుఁబోయి సుఖోపభోగమునే జీవితముయొక్క కర్తవ్యమునుగా

తాముమదిలో అంగీకరింపసాగిరి, ఈ విధముగా గ్రీకులును వారియను యాయులైన రోమనులును సుఖభోగములలో నలిగిపోయిరి వారివిషయ లౌల్యముచేత క్రీస్తుధర్మము వ్యాపింపనవకాశముండెను. ఆసమయమున క్రీస్తుమతమునందు నివృత్తియొక్క యాడంబరము ప్రవేశించుట తటస్థించెను క్రైస్తవులు వివాహమాడకుండుటను ప్రశంసనీయముగా విశ్వసింపదొడంగిరి. మనుష్యుఁడు మృత్యుపర్యంతము ఒకసారే కైకొనవలయుననియు దానిని త్యజింపరాదనియుఁ జివరకు వారేర్పాటుచేసుకొనిరి. ఇదేప్రకారముగా వారిలో జన్మముమొదలుకొని యవివాహితులై యుండువారును శారీరకమైన తపస్సును గావించి యాధ్యాత్మిక సామర్థ్యమును వృద్ధినొందుచుకొను సన్యాసులును గానారంభించియుండిరి. ఇంద్రియములమీఁద జయముపొందినతపస్సుయొక్క మనోనిగ్రహము ఇంద్రియవశులయిన వారికి నెల్లపుడును జయులోభమును జేయుచున్నది. అనఁగా నివృత్తిప్రధానమైన క్రీస్తుమతముయొక్క పవిత్ర త్వము, సర్వవిధమైన యవినీతిచేతను చెడిపోయియున్న గ్రీకుప్రజలందు రోమనుప్రజలందును సహజముగనే స్థాపితమై వారియందెక్కువ శీఘ్రముగా క్రీస్తుమతము వ్యాపించెను.

ఈ నివృత్తిప్రధానమైన వృత్తివాస్తవమున క్రీస్తుమతమునందు లేకుం డెను, క్రీస్తుమతము ఈ ప్రజలయొక్క నివృత్తిపూర్ణమైన యాచారములకు విరుద్ధముగానుండెను. ఈ ప్రజలు ఉపవాసముచేసి తమదేవతలను సంతోష పఱచుచుండిరి. మద్యమాంసములఁద్యజించి యవివాహితులుగానుండి దేవతల భజించుటయే ముక్తిమార్గమని వారువిశ్వసించుచుండిరి. క్రీస్తుమతాచా ర్యుఁడు వారికి విరుద్ధముగానుండెను.

> కర్షయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః।
> మాంచైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥

క్రీస్తుమతాచార్యుని ధర్మముపై గీతోక్తవచనములకుఁ దుల్యముగనే యుండెను, కాని మెల్లమెల్లగా క్రీస్తుమతావలంబుల ధర్మమునందుఁగూడ నివృత్తి యొక్క యాడంబరము వర్ధిల్లనారంభించెను మఠస్థాపనలు స్థాపితములుకానారంభ మయ్యెను. క్రీస్తుమతావలంబులయందు, క్రీస్తుమతావలంబియైన ధర్మోపదే

శకుఁడు వివాహము చేసికొనరాదను బంధనము వెంటనే చేయఁబడియెను; ఇంతియేగాక, వందలకొలఁది వేలకొలఁదియుఁ బురుషులును స్త్రీలును సంసారమును విడిచి యోగులును గానారంభించిరి. కొంతకాలమునకు నివృత్తియొక్క యీ స్వరూపము బలహీనమైపోయెను. నిజమైన విషయ పరాఙ్ముఖత్వము నష్టమై కేవలము కపటాడంబరము నిలిచెను. అనేకవిధములైన యనాచారములు వ్యాపించెను. చివఁకిదియే నివృత్తియొక్క స్వరూపము నకుఁ బరమావధియయ్యెను. మరల ల్యూథరుయొక్క సమయమునుండి క్రీస్తుమతావలంబుల ధర్మము ప్రవృత్తివైపు వంగెను, ఆసమయమున, యోగ్యమగురీతిని బ్రవృత్తిని స్వీకరించుట యధర్మము కాదనుసంగతి స్థాపితమయ్యెను. అపుడు ప్రొటెస్టెంటు మతను వ్యాపింపనారంభించెను. ఈదినములలో నీమతము రెండవవైపునకు అనఁగా ప్రవృత్తియొక్క పరమోచ్చమైన బిందువువైపునకుఁ బోఁగోరుచున్నదని చెప్పుటకు నేయాతంకమునులేదు. పాశ్చాత్యుల నేఁటిభౌతికౌన్నత్యమును మఱియు నాధిభౌతిక సుఖాపేక్షను ధ్యానింపఁగాఁ బాశ్చాత్య సమాజముయొక్క పెద్యులము ప్రవృత్తియొక్క పరమోచ్చబిందువువైపు పోవుచున్నదని చెప్పఁబడఁగలదు.

### భరతఖండమునకుసు నదేయితిహాసము.

పైనిజెప్పఁబడినదియు నతిసంక్షిప్తమునగు పాశ్చాత్యుల యితిహాసమునుబట్టి, మనుష్యసమాజము ప్రవృత్తి నివృత్తుల నడుమ నెట్లాందోళితమగుచున్నదో రెండువృత్తులను సమమైన తూనికగలవానిగానుంచి వానినుచితరీతి నెపుడు నుపయోగముచేయుటకు మనుష్యసమాజమునకెంత కఠినమైయుండెనో పాఠకగణము కల్పనచేయఁగలదు. ఇతిహాసముయొక్క సమాలోచనచేత మనదేశములోని జనసమాజముకూడ మొదట నిట్టి గాలియూపులననుభవించుచుండెనని తెలియఁగలదు. ప్రాచీనకాలికులు సర్వజాతివారునై పరమపూజ్యులగు ఋషులయొక్క యాశ్రమ వ్యవస్థఁబట్టి వారిరెండువృత్తులయొక్క యోగ్యమైన యాశ్రయమును గైకొనియుండిరని స్పష్టముగాఁ గనిపించుచున్నది. రెండాశ్రమములు ప్రవృత్తివియు రెండు నివృత్తివియునైయుండెను. వానియొక్క వ్యవహారపద్ధతి "యౌవనే విషయైషి" "వార్ధకేమునివృత్తి" యైయుండెను. కాని ఋగ్వేదకాలముయొక్క యంతమునఁ బ్రవృత్తి

ప్రాబల్యముఁ కలిగెను. యజ్ఞయాగాది క్రియలు అత్యంత పరిశ్రమ సాధ్యము లును అతివ్యయసాధ్యములు నయ్యెను. బ్రాహ్మణులును క్షత్రియులును మిక్కిలి నీరసమైన మార్గముచేత యజ్ఞములుచేసి స్వర్గసుఖమును సంపాదించుటయే తమయితికర్తవ్యముగాఁ దలంచిరి. వాజపేయము, రాజసూయము అశ్వమేధము, పురుషమేధము వీనియొక్క కోలాహలము లేచెను. అట్టిసమయమున నుపనిషత్తుల యుదాత్తములయిన విమర్శములారంభమయ్యెను. వేదాంతులు సంసారసుఖముకంటె నాధ్యాత్మిక సుఖమునకు మహత్త్వము నధికముగా విశ్వసింపనారంభించిరి. ఆలోచనావంతులైన లోకులు, నిష్కామవృత్తితో జగత్తునందు వసించి తపస్సుచేయుటయందును బ్రహ్మయొక్క నిదిధ్యాసముచేయుట యందును రెంటియందే మనుష్యజన్మముయొక్క సాఫల్యమున్నదని నిశ్చయించిరి. మెల్లమెల్లగా నివృత్తియొక్క యీ వృత్తియు శిఖరమునకుఁ బోయిచేరెను. ఎవనికనురాగము కలిగెనో, వాఁడు లేచి తపస్సుచేయుటకై యరణ్యమునకుఁ బోయెను. ఎవనికనురాగముకలిగెనో వాఁడు తానే యువస్థయందైనను నుండనీ, సంన్యాసమును గైకొని బ్రహ్మజ్ఞానమార్గమును గ్రహింప నారంభించు నంతటి దయినయొక సమయము తటస్థించెను. ఆసమయమున శ్రీకృష్ణుఁడు తనయొక్క దివ్యమైన భగవద్గీతోపదేశమునిచ్చి జనసమాజమును సరియైన దారికి అనఁగా ప్రవృత్తికిని నివృత్తికిని మధ్యవర్తియైన బిందువుమీఁదికిఁ దీసికొని వచ్చుటకై ప్రయత్నించెను. అతని మతము తపస్సు చేయరాదనిగాని సంన్యాసముఁ గైకొనరాదనిగాని కాకుండెను. తపస్సుయొక్క యోగ్యతను శ్రీకృష్ణుఁడు బాగుగా నెఱుఁగును. తపశ్శీలుఁడయిన మనుష్యుఁడే సుఖముయొక్క నిజమైనయోగ్యత నెఱుఁగుచున్నాఁడు. శారీరకసామర్థ్యమును ఆధ్యాత్మికతేజమును దపస్సుచేతనే వర్ధిల్లుచున్నవి. కాని తపస్సునే తనయంతిమ ధ్యేయముఁగాఁజేసికొని 'శరీరమునకు వ్యర్థముగాఁ గష్టమునిచ్చుటయెన్నఁడు నుచితము కాకపోవుటయు స్పష్టమైయున్నది. క్షణికవైరాగ్యముచేతను లేక మనోదుర్బలత్వకారణముచేత మాత్రము సంన్యాసమునుగైకొనఁగూడదు, ఇఁక నేమంటే పూర్ణమైన వైరాగ్యము లభించినతరువాతను జగత్తునశ్వరమను పూర్ణజ్ఞానము మనస్సున స్థిరపడినతరువాతను మాత్రమే సంన్యాసము గైకొనుట యుచితమైయున్నది. ఇట్లుకాదేని ప్రతివాఁడును క్షణికవైరాగ్యమున సం

న్యాసము గ్రైకొని యరణ్యవాసము చేయనారంభించును, పట్టణములన్నియు నరణ్యమునకుఁ బోవసాగును. ఇంతియేగాక సమాజమునకుఁ దరుగు సంభవించును అందునీరీతియు వ్యాఖ్యానించఁగలదు. ఇటువంటిస్థితి ముమపు బౌద్ధుల యౌన్నత్యకాలము నిజముగా నయ్యెను. అరణ్యములలోని విహార స్థానము పట్టణములతో సమానములయ్యెను అవి దురాచారులయిన భిక్షువుల తోడను సంన్యాసులనుతోడను నిండిపోయెను ఉపనిషత్తులలోని నివృత్తి మార్గముయొక్క యాడంబరమెపుడు పెరిఁగెనో యపుడు శ్రీకృష్ణుఁడు తన దివ్యోపదేశముచేత దానినాపెను. వేదాంతము సాంఖ్యయోగముందలి భ్రాంతములైన కల్పనలచేత సంసార త్యాగమే జీవనముయొక్క కర్తవ్యమని విశ్వసింపనారంభించిన లోకులను శ్రీకృష్ణుఁడు కట్టుపాటులోనికిఁ దీసికొని వచ్చెను. కుటుంబమును విడిచి యరణ్యమునకుఁబోయి నివసించినంత మాత్రమునఁ గుటుంబము విడిచిపోనేరదు. దీనికి విపరీతముగా సంసార లోలుపుఁడై యున్నంతమాత్రమునను మనుష్యునికిసుఖముదొరకనేరదు. ప్రతి విషయమునకును మధ్యబిందువున్నది, దానిమీఁద నుండినచో మనుష్యునికిఁ బరమగతి లభింపఁగలదు. ఒకవైపున శారీరకత్యాగమును జేయుట యసంభవమైయున్నది, రెండవవైపున శారీరకసుఖమందు నత్యంతము నిమగ్నుఁడై యుండుటయు మిక్కిలి హానికరమైయున్నది. ఎవఁడు యుక్తాహారవిహారుఁడయి యుండునో లేక సంన్యాసియైన మనస్సుచేతఁ గర్మఫలమును త్యజించి కర్మముఁజేయుచుండునో, ఆయోగియే పరమగతిని బొందఁగలఁడు. సారాంశమేమనఁగా, శ్రీకృష్ణుఁడు కేవల ప్రవృత్తిని కేవలనివృత్తిని నిషేధించి లోకులను మధ్యవర్తియైన బిందువుమీఁదికిఁ దీసికొని వచ్చుటకు ప్రయత్నించెను. శ్రీకృష్ణుని దివ్యోపదేశముకూడఁ గాలక్రమమున విపరీతమయ్యెనని చెప్పుటకు నావశ్యకతలేదు. వందలకొలఁది యేండ్లపిమ్మట శ్రీకృష్ణుని దివ్యోపదేశమునకుఁగూడఁ గాలక్రమమున విపర్యాసము తటస్థించెను. కొన్నివందల యేండ్లకుఁబిమ్మట శ్రీకృష్ణుని యుపదేశముయొక్క యర్థము కొంచెము తెలిసికొని ప్రవృత్తివైపునఁగిన సమాజము, గడియారము యొక్క పెండ్యులముఁవలెఁ ప్రవృత్తియొక్క చివరకొనకుఁబోయి చేరెను. అది యీ ప్రకారము పోవుట తప్పనిసరియై యుండెను శ్రీకృష్ణునితరువాత వేయి లేక రెండువేలేండ్లవరకు జనసమాజమందుఁ బ్రవృత్తియొక్క ప్రాబ

ల్యము, కృష్ణభక్తి లేక భాగవతము సుఖోపభోగమునకు సాధనమని లోకులు విశ్వసింప నారంభించునంతగాఁ బెరిఁగెను. జగత్తులో భౌతికసుఖభోగమునే మనుష్యునికి సర్వోచ్చమైన ధ్యేయముగా లోకులుమన్నింపఁదొడగిరి. అపుడు సమాజము నివృత్తిపై పుతిరిగెను బుద్ధుఁడు, మహావీరుఁడు మొదలయిన ధర్మోపదేశకులు పొడమిరి. వారు నివృత్తి ప్రధానముగ మతముయొక్క ప్రచారమును గావించిరి; కాని నెమ్మదినెమ్మదిగాఁగాల గతిచేతజనసమాజము నివృత్తియొక్క పైశిఖరమునకుఁబోయి చేరెను వేలకొలఁది బౌద్ధులయొక్క జైనులయొక్క సంన్యాసులతోడను బట్టణముతో పాటు కిక్కిరియునట్లుగా నిండి యున్న విహారములు దుర్నీతికి జన్మస్థానములయి తయారయ్యెను స్వభావమునసమాజము ప్రాపిడపాణాయామముగా మరలఁబ్రవృత్తిపై పువంగెను. అది యెంతవాఁక వంగెననఁగా, ఎక్కడ బౌద్ధులును జైనులును వేదమును ద్రోసి రాజని యరణ్యవాసమును సంన్యాసమును సింహాసముపైఁ గూర్చుండఁబెట్టి యుండిరో, యచ్చట మండనమిశ్రుఁడు మొదలయిన నవీనప్రజలు వేదము లను మరల గద్దెపై నెక్కించిరి, మద్యమాంసముల సేవ ప్రచలితమయ్యెను మరియు సంన్యాసమును బదభ్రష్టముగావించి దానిని బహిష్కరించివైచిరి. కపట సంన్యాసులు సముద్రమున సంన్యాసమును దానిపేరు తలపెట్టునంతనే మండనమిశ్రునికిఁ బట్టరాని క్రోధాగ్ని కలుగునంతటి నీచదశకుఁ దీసికొని వచ్చిరి. ఈప్రకారముగాఁ బ్రవృత్తిపై పునకు, శరముపైపుఁకుఁ బోనారంభించినపుడు, శ్రీశంకరాచార్యుఁడు వెంటనే నివృత్తిని మేలుకొలిపి సంన్యాసమును సర్వస్థానమున నిలఁబెట్టి సమాజమును మధ్యస్థ బిందువునందు స్థిరపఱచెను. కాని నివృత్తికి బలము మరలగలిగెను. రామానుజుఁడు, మధ్వుఁడు మొదలయిన ప్రవృత్త్యభిమానులయిన ధర్మోపదేశకులవతరించి మరల సమాజమును బ్రవృత్తిపై పు వంచిరి. దానియొక్క పరిణామమేమనఁగా కొంతకాలమునకు వల్లభాచార్యుని మతముత్పన్నమై యందును మూఢులునైన లోకులుగూడ దాని యొక్క ధ్యేయమును గొంచెము కొంచెముగాఁ జేయువినియోగించిరి. ఇతిహాసమును జక్కఁగాఁ జూచినచో మనదేశమందు నేఁటివఱకుఁ బ్రవృత్తి నివృత్తులమధ్య సమాజమెట్లాందోళితమగుచున్నదో దిగ్దర్శనము కాఁగలదు.

## కర్మయోగముయొక్క యుపదేశము.

శ్రీకృష్ణుని దివ్యోపదేశముయొక్క యైతిహాసికమహత్త్వము చక్కఁగా దెలియుటకై పైనిజెప్పఁబడిన సమాలోచన మావశ్యకమై యుండెను. శ్రీకృష్ణుని సమయమునఁగొందఱులోకులు వైదికకర్మాచరణమే మనుష్యునికిఁ గర్తవ్యముగా నూహించుచుండిరి మరియు సమాజమునొకవైపునకు లాగుచుండిరి. మరికొందఱు, సంసారమునువిడిచి యరణ్యమునకుఁ బోయి యుపనిషత్సంబంధియగు పురుషుని నిధిధ్యాసచేయుటయే పరమపురుషార్థమని విశ్వసించి సమాజమును మరియొకవైపునకు లాగుచుండిరి. దుర్యోధనుఁడు లేక పురుషమేధము నిచ్ఛించిన జరాసంధుఁడు పూర్వోక్త మతమునకు నిదర్శకుఁడై యుండెను ఎదుటికివచ్చిన యుద్ధసమయమునందలి కర్మమును విడిచి సంన్యాసమునిచ్ఛించిన యర్జునుఁడు రెండవమతమునకు నిదర్శకుఁడై యుండెను. ఒకనిని బలముచేతను రెండవవానిని భగవద్గీతా దివ్యోపదేశము చేతను శ్రీకృష్ణుఁడు దారికిఁదీసికొనివచ్చెను. పూర్వాచార్యులుపదేశించిన సిద్ధాంతములను, అందఱు ధర్మోపదేశకుల వలెనే శ్రీకృష్ణుఁడును దిరస్కరింప వైదిక కర్మాభిమానుల కర్మనిష్ఠను, సాంఖ్యుల జ్ఞాననిష్ఠను, యోగాభిమానుల చిత్తనిరోధమును, వేదాంతుల సంన్యాసమును నతఁడాచరించియున్నాఁడు. కాని ప్రతిమతము మనకిదియే కర్తవ్యమని దేనిని బ్రతిపాదించియుండెనో దానినతఁడు నిషేధించియున్నాఁడు. ప్రతిమతమునకు నుచితమైన మహత్త్వమునిచ్చి, వానినన్నింటిని సమన్వయించి, శ్రీకృష్ణుఁడు వానియుపయోగమును దననవీనమైన కర్తవ్యసిద్ధాంతమునకై అనఁగా నిరాపేక్షమును ఫలేచ్ఛారహితమునైన కర్మమునకై చెప్పియున్నాఁడు. అతఁడు భగవద్గీతయందు ముఖ్యముగా మనుష్యుఁడు తనకర్తవ్యమునెట్లు చేయవలయునో యీసంగతిని బ్రతిపాదించియున్నాఁడు. శాస్త్రముయొక్క కార్యము కర్తవ్యమును నిశ్చయించుటయేయైయున్నది. కాని యిది నిశ్చయమైనపిమ్మట నదియెందులకుఁ జేయవలయునో, యెట్లుచేయవలయునో వీనియొక్క పూర్ణమైన వివేచన మిగుల నుత్తమమైనరీతిగాఁ చేయబడియున్నది. శ్రీకృష్ణుఁడర్జునునికి, ఆపత్తులనుండి జడిసి లేక మోహపాశమునఁ జిక్కి కర్తవ్య పరాఙ్ముఖుఁడగుటయు నరణ్యమునకుబోయి సంన్యాసమును గైకొనుటయు నిజమైన మోక్ష

మార్గమునందు సంచరించుటకానేరదని చక్కఁగాఁదెలిపియున్నాఁడు. సారాంశము, శ్రీకృష్ణుఁడు భగవద్గీత యందర్జునికి వేదమును, వేదాంతమును, సాంఖ్యమును, యోగమును సత్కరించుట యుచితమని బోధించియున్నాఁడు. అవియన్నిటియందును దమశమవిషయమునఁ గొట్టఁబడిన బడాయియంతయు వ్యర్థమనికూడఁ జెప్పియున్నాఁడు. ప్రవృత్తికి నివృత్తిరూపమును నివృత్తికిఁ బవృత్తిరూపమును నెట్లీయుపలయునో తనకర్తవ్యమునెట్లు చేయవలయునో యదికూడ నాతఁడు తెలియఁజేసియున్నాఁడు. ఒకదృష్టితోఁ జూచినయెడల భగవద్గీతయన్నిటికంటెఁ బ్రాచీనమైన సాంఖ్య శాస్త్రమైయున్నది, అట్లువేదాంతశాస్త్రము మరియు యోగశాస్త్రముకూడనైయున్నది ఈయన్నిశాస్త్రములయొక్క మాన్యమునయిన సిద్ధాంతములు నెచ్చటనయినఁ గలువఁబడు తేజస్వినియైనవానితోఁ జెప్పఁబడియుండినచో నయ్యది భగవద్గీత యందే. ఇందుచేత భగవద్గీతకు నుపనిషత్తు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము మొదలగు విశేషములు యదార్థములే యైయున్నవి.

## నవీన భక్తి మార్గము

ప్రాచీనార్య లుపదేశించిన వేదము, వేదాంతము సాంఖ్యము, యోగము ఈయన్నింటిలో మాన్యములు ను ... ములైన యంశములను శ్రీకృష్ణుఁడు అమోఘమైన ... వానితో ... దెలియఁ జెప్పెను. ఇంతియేగాక ... ము ... చేన ... ముగా నుప దేశింపఁబడిన భ ... మా ... ము ... ంచెను. భక్తిమార్గము నకు లేక భాగవ ... ము ... మొ ... యు ... దేశకుఁడగు శ్రీకృష్ణుని చేతనే యీ మతముస ... ంచెను. మన యభిప్రాయమై యున్నది. దీనియొ ... స్వరూపము పాంచరాత్రిమతము. ఈ జ్ఞానమును ... యనియు, రాజగుహ్యమనియుఁ బేరులతో భగవ ... జెప్పియున్నాఁడు మఱియు దానినే, తరువాతనంతమునఁ బదు ఎనిమిదవ యధ్యాయములో "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం ... " అని యుర్ధ శ్లోకమున నర్జుననికి మరలఁ జెప్పెను. ఏకాగ్రచిత్తమున నొక పరమేశ్వరుని ప్రేమ పూర్వకముగా భజించి యతని శరణమున లీనుఁడగుట యనెడు మోక్షమార్గమునందలకు నాతంకము లేక సులభమై యున్నది.

సంన్యాసము, యోగము, యజ్ఞాది సాధనములు నందఱకు సులభములు నాతం కము లేనివియుఁగా నయ్యెను. యజ్ఞయాగములు వేలకొలఁది రూప్యముల వెచ్చింపక కానేరవు లేక శాస్త్రముల సూక్ష్మజ్ఞానము వినాగాఁ గాఁజాలవు. ఇదే ప్రకారము బుద్ధిమంతులకును, నిగ్రహవంతులకును తక్కిన సంన్యాసమును యోగమును మఱియొకరి కెవరికిని ప్రాప్తింపజాలవు. అపుడు మనుష్యుని యెదుట, ద్రవ్యహీనులు, బుద్ధిహీనులునై సంసారమందుఁ జిక్కుకొన్న జీవులకుఁ దరణోపాయమేమియైన నున్నదా లేదా? యని ప్రశ్న ముపస్థితమగు చున్నది, కాని యా సమయమున నీ ప్రశ్నము విశేషరీతి నుపస్థితమై యుండెను. భారతీయార్యులు హిందుస్థానమునకు వచ్చినప్పుడు వారిలో మూఁడు వర్ణములుండెడివి. హిందుస్థానమందు నార్యుల విశేషించి చంద్రవంశ క్షత్రియుల నివాసస్థాన మెల్ల యెడల వ్యాపించినప్పుడు, నాల్గవ శూద్ర వర్ణము వారిలో వచ్చి గలసెను. అప్పుడనేక మిశ్ర వర్ణము లుత్పన్నమైనవి. చాల మంది వైశ్యులు వ్యవసాయము చేయ మొదలిడి మెల్లమెల్లగా వేదము నుండియు శిక్షనుండియు పరాఙ్ముఖులైరి. స్త్రీలెల్ల వర్ణములవారై కాఁదొడఁగిరి. ఇందుచేత వారుగూడఁ జాలమట్టు చదువురాని వారైయే యుండిరి. ఇట్టి పెద్ద జన సమూహమునకు యజ్ఞము, సంన్యాసము లేక యోగ మార్గము కటువడి పోయినది. ఆ సమయమున, ఈ స్థితిలో నజ్ఞానులైన లోకుల కు పరమపద ప్రాప్తి సంభవమా? కాదా? యను ప్రశ్నము మిగుల నెక్కువగా నెదుటికి వచ్చెను. ఈ లోకులు మోక్షమునకుఁ దగరని బ్రాహ్మణులయు క్షత్రియులయు మతమై యుండెను. జనసామాన్యమునందు శ్రీకృష్ణుని కతి ప్రేమయుండెను. ధర్మదృష్టిచేత వారి నుద్ధరించుటకై శ్రీకృష్ణుఁడవతరించి యుండెనని చెప్పుటకు నాటంకమేమియును లేదు. అతని బాల్యము స్త్రీలు, వైశ్యులు, శూద్రులు ఈ మువ్వురియందే గడచి యుండెను. ఈ లోకులు తమ యిష్టదైవముమీఁద నెట్టి నిస్సీమము నిష్కామములైన ప్రేమ నుంచు చున్నారో తన కన్నులారఁ జూచియుండెను. ఇట్టిస్థితిలో నతఁడు, పరమేశ్వరుని భక్తి పరమేశ్వరుని దివ్యవిభూతిని దేనికైనను నిరతిశయముగాఁ బ్రేమించుటచేత మఱియు నతని భజించుటచేతను నీలోకులు మోక్షమును బొందఁగల రను నుదాత్తమతమును బ్రతిపాదించియుండుటలో నాశ్చర్యమేమియు లేదు. భక్తిమార్గముయొక్క రహస్యము నర్జునుని కుపదేశించుచు నతఁడు భగవ

యందు, భక్తిమార్గముచేత స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అంతేగాక చాండాలురును బరమగతికిఁ బోఁగలరని స్పష్టముగాఁజెప్పెను. ఆ సమయమున సమాజమందు రెండు పక్షములు కనిపించుచుండెను- పుణ్యవంతులైన బ్రాహ్మణులును, భక్తులైన రాజర్షులును. ఒకరు సంన్యాసమును దపస్సును నభిమానించుచుండిరి, రెండవ వారు పెద్దపెద్ద యశ్వమేధములు మొదలైన యజ్ఞముల నభిమానించుచుండిరి. మనమే మోక్షమును బొందుదుము మఱియొకరు పొందరని వారి నిశ్చయమై యుండెను. మొదటినుండియుఁ బుణ్యమార్గమున శోభిల్లుచున్న యీ లోకులు ఈశ్వరుని భజించి భక్తిచేత పరమగతిని బొందఁగలుగుట నిశ్చయము, కాని శ్రీకృష్ణుఁడు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, చాండాలురు మొదలైనవారును భక్తిచేతఁ బరమగతిని బొందగలరని బొమ్మి కొట్టుకొనిచెప్పియున్నాఁడు. స్వభావమున శ్రీకృష్ణుని యీ భక్తి మార్గము మెల్లమెల్లగా నితర మార్గములను వెనుకకు ద్రోయుచు భరతఖండమునముందునకుఁ బోయెను. మఱియు దాని యొక్క శ్రేష్ఠత నేఁడు భరతఖండమంతటను గనుపట్టుచున్నది. "రామః శస్త్రభృతా మహం" మఱియు "వృష్ణీనాం వాసుదేవోస్మి" వీనిలోఁజెప్పఁబడియున్న రెండు విభూతుల భక్తియు నేఁడు హిందుస్థానమందంతటను బ్రచలితమైయున్నది. అంతేకాక, అతఁడు యజ్ఞము, తపము, సంన్యాసము మొదలైన మార్గములను గూడ వెనుకకుఁ ద్రోచియున్నాఁడు. దీనిఁబట్టి హిందుస్థాన నివాసులు శ్రీకృష్ణుని నెందులకింత పూజ్యునిగా విశ్వసించుచున్నారో సులభముగానే ధ్యానమునకు రాఁగలదు. వేదాంతసూత్రములు లిప్పటివఱకు, కేవలము బ్రాహ్మణులు వారుగూడ సంన్యాసమును దీసికొన్న పిదప నే మోక్షమును బొందఁగలరనియే చెప్పుచున్న వ్యాముపల్కుముల ధర్మోపదేశకులు. మోక్షప్రాప్తి మునస్మామల భాగ్యమునందే యున్నది. యితరులకు లేదు అని చెప్పుచున్నారు, క్రీస్తుమతావలంబులైన ధర్మోపదేశకులు, క్రీస్తు మతాచార్యుఁడు క్రీస్తుమతావలంబులనే యుద్ధరించువనియు, ఇతరుల నుద్ధరింపఁడనియుఁ జెప్పుచున్నారు- కాని శ్రీకృష్ణుఁడు భగవద్గీతయందు, మనుష్యుఁడు ఏ జాతివాఁడైనను సరే లేక యే మతమువాఁడైనను సరే, వాఁడు పరమేశ్వరుని యే విభూతినైనను భజించెనేని మోక్షపదమునుఁ బొందఁగలఁడను నుదాత్తతత్త్వమును బ్రతిపాదించెను. భక్తిమార్గము యొక్క లేక (రిలిజియన్ ఆఫ్ డివోషన్) (religion of devotion)

యొక్క యుదాత్త స్వరూపము శ్రీకృష్ణుని భక్తి మార్గమందుఁ గనిపించు చున్నట్లుగా మరియెచ్చటను గనిపింపదని చెప్పుట యెంతమాత్రము నతిశయోక్తి కానేరదు. ఈ స్వరూపమునకు సర్వోత్కృష్టత (పరాకాష్ఠ)ను తుకారాము, తులసీదాసు మొదలైన సాధులు సంపాదించిరి. సతతం కీర్తయంతో మాం నిత్యయుక్తా ఉపాసతే) దీనికి మనోహరులైన సాక్షులు అయోధ్య, మధుర, బృందావనము లేక పండరపురము దక్క మరియెందును లభింపరు. శ్రీకృష్ణుఁడు తన యుదాత్తతత్త్వముల యీ భక్తిమార్గమును మొట్టమొదట నర్జునుని కుపదేశించినప్పటినుండి దాని యుత్కర్షము (యద్గత్వా న నివర్తంతే) రీతిని హిందుస్థానమున నంతటనై యున్నది. ఈ భక్తిమార్గముచేత శ్రీకృష్ణావతారముయొక్క ముఖ్యములైన ధార్మిక కార్యముల ముద్ర భారత భూమివాసుల హృదయ ఫలకములమీఁద శాశ్వతముగా నంకితమైయున్నది.

## కర్మయోగముయొక్క సిద్ధాంతము.

శ్రీకృష్ణుఁడింతకంటెను నెక్కువ మహత్త్వముగల యొక పనినిదత్త్వజ్ఞానవిషయమునఁ జేసియున్నాఁడు. కాని దానియొక్క ముద్ర హిందుస్థానీయుల హృదయఫలకములపై శాశ్వతముగను స్పష్టముగను చిహ్నితముగాక కనిపింపకున్నది. దీనికిఁ గారణమును మనము ముందే చెప్పియుంటిమి, తత్త్వవేత్తల సమ్ముఖమున, జగత్తున మనుష్యుని కర్తవ్యమేమియని యతివికటమైన గొప్పప్రశ్న మెపుడునుపస్థితమగుచున్నది. షేక్స్పియరు చెప్పినట్లు — (To be or not to be, that is the question.) ఈజగత్తున జీవించియుండుటకు నేదేని సార్థకతయున్నదా లేక మనుష్యుని జీవనము నిరర్థకమా? కర్మమునకు అకర్మమునకు సంబంధించిన వాదమనాదియై యున్నది. ఇది విమర్శకుల (విచారశీలుర) యెదుటఁ జిరకాలమునుండి యుపస్థితమైయున్నది. శ్రీకృష్ణుఁడు గీతలో సమస్తవివేచనను నుపసంహరించునపుడు పదునెనిమిదవయధ్యాయమున దివ్యమునమోఘమునయిన తన వాణితో నీప్రశ్నమును జర్చించి తనసిద్ధాంతము నర్జునునికి బోధించెను. మనుష్యుఁడు మోక్షమార్గమును బొందుటకై వేదములోని యజ్ఞయాగములను వేదాంతములోని సంన్యాసమును, లేక సాంఖ్యమార్గములోని జ్ఞానమును, యోగములోని చిత్తవృత్తి నిరోధమును, భక్తిమార్గములోని భజనమును దేని

నిషపడి.ను దానిని స్వీకరింపవచ్చును, కాని వాఁడు కర్మమును మాత్రము చేయకతప్పదు. వాఁడెన్నఁడును దానినుండి, తప్పించుకొనఁజాలఁడు. సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, నెల్లపుడుమదిరుగుచున్నవి; సముద్ర మెపుడును దరంగించుచున్నది. కాని యొకపుడు మెల్లగాను, ఒకపుడు వడిగాను అను నింతమాత్రపు భేదమే కలదు మనుష్యునియూపిరి యెట్టివేళ యందును నాఁగిపోనేరదు; మరణించినపిమ్మటనే యాగిపోవుచున్నది. తడిసిన మట్టి యెల్లపుడు నొకస్థితియందే యుండదు. సారాంశమేమనఁగా ఈజగము సంయుక్రియ సంతతముజరుగుచు శాశ్వతముగానుండును. ఈ లోకము కర్మ బద్ధమైయున్నది. నియతమైన లేక ప్రాప్తమైన కర్మమును విడిచిపెట్టుట సంభవము నేరదు. ఎవరు మూర్ఖతచేత దానిని త్యజించుచున్నారో వారు తమసులగు త్యాగులయి యున్నారు. ఐచ్ఛికమైన కర్మమును జేయుట యుఁ జేయకుండుటయు మనచేతిలో నున్నట్లు కనఁబడుచున్నది; కానియిందులోఁగూడ స్వాభావికముగాఁ బ్రాప్తమైన కర్మమువదలిపోదు. ఇచట సదోషమునకు సంబంధించిన విమర్శమును గావించుటయు వ్యర్థమైయున్నది. అగ్ని యెల్లపుడును ధూమముచే వ్యాప్తమై యున్నట్లే కర్మముయొక్క యారంభము దోషముచేత వ్యాప్తమైయున్నది కాఁబ, కర్మస్వభావమైతే సిద్ధము సహజమునయియున్నది, కని సదోషమైయున్నది, అపుడు కర్మమును చేయుట శ్రేయస్కరమేయైయున్నది. కర్మము విడిపోవుట లేక కర్మమును విడిచిపెట్టుట యసంభవమను నీసిద్ధాంతము శ్రీకృష్ణునిదియని తాత్పర్యము. ఈ సిద్ధాంతమును పాశ్చాత్యతత్త్వజ్ఞాన లుగూడ మన్నించితీరవలయును. కర్మమునాచరించుటయందే మనుష్యత్వమునకు గౌరవమున్నదనియే వారును సమ్మతించుచున్నారు. కాని శ్రీకృష్ణుని కర్మయోగములో నింకొకవిశేషమున్నది, యది పాశ్చాత్యపండితులకొకవేళ సమ్మతముకాకపోవచ్చును. మనుష్యుడు కర్మము ను జేయవలయునవఁగా వానికది యుచితమైనది కావలయును. నియతిలేక సహజమైన కర్మము తొలఁగిపోవజాలదు, మరియు ఐచ్ఛికకర్మము కర్తవ్యమైన యెడలఁ జేయవలసినదే. మనుష్యుని కేదికర్తవ్యమో దానిని శాస్త్రాధారము చేత నిశ్చయించుకొనవలయును ;లేక తన సదసద్వివేకముగల బుద్ధితో నిశ్చయించుకొనవలయును. మనుష్యుని యొక్క శుద్ధము సాత్త్వికమునయిన బుద్ధి వానికి వానియొక్కకర్తవ్యమును

జెప్పుచున్నది. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని చెప్పి శ్రీకృష్ణుఁడు మనుష్యుని సాత్వికబుద్ధి "కార్యాకార్యములను, భయాభయములను" తెలిసికొనుచున్నదనికూడఁ జెప్పియున్నాఁడు తనకర్తవ్యమును నిశ్చయించుటకై శాస్త్రముయొక్క యావశ్యకత లేనియెడల దానిని తన సదసద్వివేచకమైన బుద్ధితో నిశ్చితము చేసికొనవలయునని తాత్పర్యము. ఈవిషయమై పాశ్చాత్యపండితు (లొకప్పుడే)లేభవింసవచ్చును శ్రీకృష్ణుని కర్మయోగములో (అతఁడుచేయునది మనుష్యునికుచితమైనది కావలెనని యిం కొక విశేషమున్నది;). మనుష్యుఁడు కర్మమును జేసితీరవలయును; కాని యాకర్మము సిద్ధించితీరవలయునని పట్టుదలకూడదు. నేను నాకర్తవ్యమును జేయుచున్నాను, అది సిద్ధిపనీ సిద్ధింపకపోనీ: యనుభావనతో మనుష్యుఁడు కర్మమును జేయవలయునని శ్రీకృష్ణునియొక్క కర్మసిద్ధాంతము. అందుఁ గర్మయోగముయొక్క యారంభమునందే "సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే." అని వ్యాఖ్యచేయఁబడి యున్నది. సిద్ధిని అసిద్ధిని సమానముగా మన్నించి; అనఁగా ఫలమందు లక్ష్యముంపక తన కర్తవ్యమును జేయుట మనుష్యునికుచితమై యున్నది. శ్రీకృష్ణుని యుపదేశమేమనఁగా "తస్మాదసక్తః సతతం కార్యం కర్మసమాచర" ఇచట నొకవేళ శ్రీకృష్ణునికి పాశ్చాత్యపండితులకును మతము భేదించుట సంభవము.

## ఫలాపేక్షను విడుచుట

ఈ సంగతి యిట్లుండఁగా గర్తవ్యాకర్తవ్యముల నిశ్చయించున ధర్మముయొక్క యధిష్ఠానమేమనియు, శుద్ధమైన భావనచేత విహిత కర్మమును గావించిన తరువాతఁ గూడ మనుష్యునికి దానియొక్క సిద్ధి లభించు దేని విహితాచరణమునకు లాభమేమనియు ప్రశ్నము లిచట సహజముగా బయలుదేఱుచున్నవి. కనుక నిచ్చట ధర్మముయొక్క ముఖ్యమైన యాధారమే నష్టమగుచున్నదని చెప్పుటలోఁ గొంచెమైన యసమంజసము లేకున్నది. ఈ ప్రశ్నములు కూడ ననాదిసిద్ధమై యున్నవి. ధార్మికవృత్తిగల లోకులు జగత్తున దుఃఖవంతులుగను నధార్మికులు నరియు దుష్టులైన లోకులెడతెగని యౌన్నత్యమునొందినవారగను గన్పడుచుండుట యనెడు నది జగత్తులో మిక్కిలి గొప్పదియగు గూఢరహస్యమైయున్నది. దీనికి గొందఱు, ఈలోక

మునఁగాకున్నను బరలోకమున, ఈజన్మమునఁ గాకున్నను మరియొకజన్మమున, ధర్మఫలమగు సుఖము అధర్మమునకు ఫలమగుదుఃఖము రాకతప్పదని సమాధానముఁ జెప్పుచున్నారు; కాని యీ సమాధానము అదృష్టముయొక్క యాధారముమీఁద వచింపఁబడియున్నది. ఇందుచేత నయ్యది అసందర్భముగా నగపడుచున్నది. విహితకర్మము నాచరించిన పిదప నయ్యది సిద్ధింపనిచో దానికి విహితత్వము మాత్రమెక్కడనుండును? మనుష్యుఁడు ధర్మముపై నిష్కామప్రేమమునుంచి కర్మముఁ జేయవలయుననియు ఆగామిసుఖరూపమైన యాశకొఱకుఁ జేయరాదనియు సిద్ధాంతము సత్యమైయున్నది; కాని యీ సిద్ధాంతము యుక్తియుక్తముగాకున్నది. ఒకానొకప్రసంగమున ద్రౌపది యీ ప్రశ్నమునే చేసియుండెను; అపుడు ధర్మరాజుత్తరమిచ్చెను— "సుందరీ? * నేనుజేయుచున్న ధర్మమును ధర్మఫలముపైపు దృష్టినుంచి చేయను. ధర్మమ నొక వ్యాపారముగాఁ జేయనిచ్ఛించిన ఆ మనుష్యుఁడు ధార్మికులనడుమఁ దక్కువతరగతి మనుష్యునిగా మాహింపవలయును." ఈ యుత్తరము యుక్తముగానున్నది కాని యీ యుత్తరమువలనఁ దార్కికులకు సమాధానము కానేరదు. శ్రీకృష్ణుఁడీ ప్రశ్నమునకు మిక్కిలి మార్మికమైన యుత్తరమునిచ్చియున్నాఁడు కర్మమునకు ఫలము మూఁడు విధములుగానున్నది—ఇష్టము, అనిష్టము లేక మిశ్రము. కాని యిదియెవనికొఱకు? ఎవనిదృష్టి ఫలముమీఁదనున్నదో, వానికేయిది. ఫలముమ ద్యజించినవానికి నెట్టిఫలము లభించినను సమానమేయగుచున్నది. ఇదిగాక మనుష్యుఁడెట్టికార్యమును జేసినను దానిఫలమునకు నైదు కారణములావశ్యకములై యున్నవి. అధిష్ఠానము, కర్త, కారణము, వివిధచేష్టలు దైవము లేక ఈశ్వరేచ్ఛ. దీనిఁబట్టి కర్మఫలమునిచ్చునవి, తనవశములో నుండని యసాధారణకారణములని తెలియుచున్నది. అనఁగాఁ గర్మఫలము తనకర్తృత్వమీఁదనే యాధారపడునదికాదు ఇంకనేమంటేని యితర కారణములమీఁదఁగూడ నాధారపడియున్నది. కాఁబట్టి కర్తవ్యమని యెంచి చేయఁబడిన కర్మమే యుక్తమైనది. దానికిఁ గోరఁబడిన ఫలమెల్లపుడును లభింపదు. మను

* ధర్మంచరామి సుశ్రోణి న ధర్మఫలకారణాత్ ।
ధర్మవాణిజ్యకో హీనో జఘన్యో ధర్మవాదినాం ॥

ష్యుఁడు కర్తృత్వముయొక్క యహంకారము నెప్పుఁడు నుంచుకొనకుండుట యుచితమైయున్నది. ఎందుచేతననఁగా ఫలసిద్ధికి ఐదుకారణముల యావశ్యకతయున్నది. వానిలోఁ గర్త కేవలమొక్కఁడై యున్నాఁడు. సారాంశ మేమనఁగా యుక్తియొక్క దృష్టిచేతఁగూడ, మనుష్యుఁడు తనకర్తవ్యమును గర్తవ్యముగానెంచియే చేయవలయునుగాని దానిఫలముపై పు దృష్టినుండఁ గూడదనెడి శాస్త్రదృష్టాంతమే సరిగా నగపడుచున్నది.

## ఈశ్వరాజ్ఞ, ఈశ్వరార్పణబుద్ధి.

కర్తవ్యమెల్లపుడును సిద్ధించితీరునను నిశ్చయములేదేని మరలఁ గర్తవ్యమునకు గౌరవము మాత్రమేముండును? ఇట్టిస్థితిలోఁ గర్తవ్యమునకు మహత్త్వము కొంచెమైన నుండనేరదు అని యింకొక ప్రశ్నమిచ్చుట నుపస్థితమగుచున్నది. కర్తవ్యమందును గర్తవ్యతయందును భేదముకొంచెమైనను లేకయుండును. కాని కొంచెము విచారింపఁగా నీశంకకు సమాధానము రాఁగలదు. శాస్త్రముయొక్క పనియేమనఁగాఁ గర్తవ్యమును నిశ్చయించుటయే శాస్త్రమనఁగా తమయనుభవముచేత నియమములలేర్పఱిచిన ప్రాచీనబుద్ధిమంతులని తాత్పర్యము. అనగా కర్తవ్యమునందు నొకవిధమైన జ్ఞానయుక్త హేతువుకలదు. శాస్త్రసమ్మతికిఁగూడ, సాత్త్వికబుద్ధిచేతఁ గర్తవ్యనిశ్చయము చేయఁబడినవ్వటికిని అందొకవిధమైన మహత్వమును బవిత్రతయును గలదు. మనుష్యునికిఁ గర్తవ్యమును బోధించునట్టి యకలుషితమైన సాత్వికబుద్ధి యుక్తము మన్నింపఁదగినదియునై యున్నది. కాని యిది యీశ్వరప్రేరణయే యైయున్నది. అది యీశ్వరుని యాజ్ఞయేయని యూహించుటకు నాటంకమేమియునులేదు. కర్తవ్యమునకుఁ గర్తవ్యత దీనిచేతనే ప్రాప్తమగుచున్నదని సారాంశము. ఇదేదృష్టిచేత మనుష్యుఁడు ఫలముపై పు ధ్యానముంపక కర్తవ్యమును జేయఁగలఁడు. తనకర్మయోగమునకు నీమూఁడవ విశేషమునే శ్రీకృష్ణుఁడు చెప్పియున్నాఁడు. మనుష్యుఁడు తనకర్మమును బరమేశ్వరుని కర్పించుచుఁ జేయుట యుచితమైయున్నది. పరమేశ్వరుని యాజ్ఞననుసరించి తనకర్తవ్యమును జేయువాఁడే ఫలేచ్ఛారహితమైన కర్తవ్యమును జేయఁగలడు. ఈ యిచ్ఛభావనతోఁ గర్మమునుజేయు మనుష్యుఁడు ఉత్సాహముతోను బ్రేమతోను దనకర్తవ్యమును బూర్తిచేయఁగలఁడనుటకు

సందేహమేమియు నులేదు. కర్తయొక్క మనసునందుఁ గర్తవ్యము సిద్ధించునా లేదా యను శంక కలుగునేని వానియందు ధైర్యోత్సాహములుండుట యసంభవము. కర్తవ్యముయొక్క ఫలముపైపు దృష్టియుంపఁబడదేని మనుష్యుఁడు నిరుత్సాహుఁడై పోవునని యాక్షేపనముఁ రాఁగలదు. కాని యా కర్తవ్యముఁనే మనుష్యుఁడు, నేనీశ్వరాజ్ఞచేతఁ జేయుచున్నానని యు నతని కర్పణముఁ చేయుచున్నాననియు నీభావనతోఁ జేయునపుడు వానికుత్సాహధైర్యములు తగ్గిపోనేరవు. సారాంశమేమనఁగా, శ్రీకృష్ణుని కర్మయోగమునకు నియ్యది మూఁడవ యుచ్చతమమైన విశేషము. 'చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః' ఈ రీతిని మనుష్యుఁడు తన కర్తవ్య కర్మమును జేయవలయునని దానియొక్క సిద్ధాంతము.

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥

ఈ చిన్న లక్షణమునందు శ్రీకృష్ణుని కర్తవ్య సిద్ధాంతము యొక్కయుచ్చమైన రహస్యము సంపూర్ణముగా ఇమిడియున్నది. ఇటువంటి కర్త యెచ్చటనైనఁ బ్రత్యక్షమగునా యని యెవరైన నొక్కరు శంకింపఁగలరు. కాని యిటువంటి మహాత్ములైన కర్తలు ప్రపంచమున సరిగాఁ జూచినయెడల లభింపఁగలరనుట నిర్వివాదమై యున్నది. దీనికొక చిన్న యుదాహరణమును జూచుటకై, మరణాసన్నుఁడైన పుత్రుని మరణము లేక స్వస్థతయనెడు ఫలములను బరమేశ్వరునికి విడిచిపెట్టి ధైర్యోత్సాహములతో వానికి శుశ్రూష చేయుటయందే లగ్నమైయున్న శాంతురాలును, జ్ఞానవతియునగు నొక స్త్రీని గైకొనుఁడు. ఈ యుదాహరణమును జూచినచో మనకు, ప్రపంచమున నెట్టి సాత్త్విక కర్తలో యున్నారని నమ్మకము కలుగఁగలదు.

## అహింసా మతము

ఈ ప్రకారముగా శ్రీకృష్ణుఁడర్జునునికిఁ దన కర్మయోగమును జక్కఁగా నుపదేశించి స్వధర్మమును బ్రాప్తమునునైన యుద్ధముయొక్క సమయమున నతఁడు చూపియుండిన పరాఙ్ముఖత్వమును దొలఁగించి యుండెను. దీనిఁబట్టి శ్రీకృష్ణుఁడు హింసకనుకూలుఁడై యుండెనని యూహింపరాదు.

అతఁడహింసా మతాభిమానిమై యుండెను మఱియు నాతఁ డామతమును శక్తికొలఁది యుపదేశించి యున్నాఁడు. అహింసా మతమునకు మొదటి యుపదేశకులు బుద్ధుఁడు, జైనుఁడునై యున్నారని చాలమంది దృఢముగా నమ్ముచున్నారు. కాని వారు పొరపడుచున్నారు. అహింసామత ముపనిషత్తులో నున్నది. ఛాందోగ్యముయొక్క యాదేశమేమనఁగా– "అహింసన్ సర్వభూతాని అన్యత్ర తీర్థేభ్యః" భగవద్గీతయందుఁ గూడ నహింస జ్ఞానము యొక్క లక్షణములలోఁ జెప్పఁబడియున్నది. ఇంతేగాక యహింస శారీరిక మైన తపస్సైన్న యున్నదనికూడఁ జెప్పఁబడియున్నది అన్యదేశీయుల యితిహాసముఁ బట్టియు నహింసా తత్త్వము హిందూ ధర్మమందు మొదటినుం డియుఁ గలదని తెలియుచున్నది. పైథాగోరస్సుది యహింసా మతమై యుండెననియు దానినతఁడు హిందుస్థానమునుండి సంపాదించె ననియు నొప్పుకొనఁబడియున్నది. హిరాడోటస్సుయొక్క యితిహాసమందు, అహింసా మతవాదులైన లోకులు హిందుస్థానములో నుండిరని స్పష్టముగాఁ జేర్కొనఁ బడియెను. సారాంశమేమనఁగా అహింసామతము బుద్ధునికి మునుపటిదియై యున్నది. దానియొక్క యుత్పత్తి శ్రీకృష్ణుని యుపదేశము నుండియే యైనదని తెలియుచున్నది. శ్రీకృష్ణుని కాలము ఋగ్వేదోత్తరము నుపనిషత్కాలికమునై యున్నది. ఆ సమయమున యజ్ఞయాగములకు సంపూర్ణ ప్రాబల్యముండెను. అతఁడిట్టి సమయమున యజ్ఞమందు జరుగుచున్న హింసను మాన్పెడు నుపదేశము నెచ్చటను నిచ్చియుండలేదని యెవరైనఁబ్రశ్నించినచో నతఁడిట్లు చేయకుండుటలో నాశ్చర్యములేదని జ్ఞప్తి యుంచుకొన వల యును. ఆలోచింపఁగా నతఁడు పాండవులు రాజసూయము నశ్వమేధమును గావింపకుండ వారి నడ్డగింపలేదు, అయినను అతఁడు బాల్యమందే గోపాలకులకు ఇంద్రయజ్ఞమునకు మాఱు గిరియజ్ఞమును గావింపుఁడని యుపదేశించి యుండెనని ధ్యానములో నుంచుకొనవలయును. భగవద్గీతయందుఁ గూడ స్వర్గాపేక్షతో ననేకవిధమైన కామ్యయజ్ఞములఁజేయుట విరుద్ధముగా ఇట శ్రీకృష్ణుని సంపూర్ణకటాక్షము కనిపించుచున్నది. శ్రీకృష్ణుని కాలమునకుఁ బిమ్మట హింసాయుక్త యజ్ఞములకు విరుద్ధముగా మెల్ల మెల్లగా లోక మతము వర్ధిల్లసాగినట్లు కనిపించుచున్నది. హిందుస్థానమందలి లోకులందఱును గవాలంభమును శ్రీకృష్ణుని యందలి భక్తిచేతనే మానివైచియుండిరని చెప్పుటకు నాపత్తి యేమియును లేదు.

శ్రీకృష్ణుఁడు తనయుపదేశమునకనుగుణముగా నాచరించుట

భక్తిమార్గము, కర్తవ్య నిష్ఠ, అహింస మొదలుగా నవీనములైన యుచ్చ తత్త్వములు శ్రీకృష్ణుని దివ్యోపదేశముచేతనే హిందూ ధర్మమందు సమావేశమైయుండెను. ఈ సంగతులనుబట్టి ధర్మము విషయమై శ్రీకృష్ణుఁడు చేసిన పనియొక్క మహత్త్వమెంతయో వాచకుల ధ్యానమునకు రాఁగలదు. శ్రీకృష్ణునియొక్క యుదార చరిత్రము అతని యుదాత్తోపదేశమునకు ననురూపముగానే యుండవలయునను సంగతి యందఱకును మాన్యము కాఁగలదు. తుకారాము (బోలే తైసా చాలే, త్యాచీ వందావీ పావులేం) ఈ వచనముల ననుసరించియే శ్రీకృష్ణుఁడు వందనీయుఁడై యుండెను; అతని మనము పుణ్యశ్లోకుఁడని చెప్పుట విరోధి లక్షణము దేనిచేతను గాదు. ధర్మసంస్థాపనమునకే శ్రీకృష్ణుఁడవతరించి యుండెను. ఈ సంగతులన్నియు మిక్కిలి స్పష్టములైనప్పటికిని రెండు కళంకము లాతని చరిత్రమందు నావరించియున్నవి. ఆలోచింపఁగా నీ కళంకములు చంద్రుని కళంకమువలె రమ్యములు కావు. అయినను నిస్సందేహముగా నవి యసత్యములును కాల్పనికములునై యున్నవి. శృంగార ప్రియులైన కవులును, హాస్యప్రియులైన కథకులును వానినింకను బెంచి వానియందు పత్యాభాసమును దెచ్చిపెట్టుట దుర్దైవ కారణముననై యున్నది. కాని యిట్లెన్నఁడును సంభవము కాదు.

త్రివిధం నరకస్యేదం ద్వారంనాశనమాత్మనః।
కామఃక్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్॥

ఈవిధముగా నుదాత్తోపదేశము నొసంగిన శ్రీకృష్ణుఁడు, బాల్యమునందే నింద్యమైన కామచారమునఁ జిక్కునా? లేక యువావస్థయందు లోభమునకు వశుఁడగునా? విచారింపఁగా నీకళంకములు నిష్ప్రమాణములయి యున్నవి. అయినను లోకుల కల్పనచేత శ్రీకృష్ణుని చరిత్రమందుఁ గలుపఁబడుచున్నవి. ఈ రెండుదోషములు నిరాధారములు, ఆలోచన తక్కువయైన కారణముచేఁ దరువాతఁ గల్పింపఁబడియున్నవి. మనము సంక్షేపముగా వానిదిగ్దర్శనము నిచటఁ జేయుదము.

## గోపికలయొక్క కేవలభక్తి.

శ్రీకృష్ణుని సమయమున, అతఁడు గోపికలతో నశ్లాఘ్యమైన వ్యవహారములు జేసియుండెనను దోషమతనిపై నెన్నఁడును మోపఁబడియుండలేదు; గోపికలు శ్రీకృష్ణునియెడఁ జూపియుండిన ప్రేమము నిర్వ్యాజమును విషయాతీతమును ఈశ్వరభావనాయుక్తమునయి యుండెను. ఇదేకల్పన మహాభారతమందుఁ గనిపించుచున్నది. మహాభారతమునకు వర్తమానస్వరూపము క్రీస్తువత్సరమునకు దాదాపు 20 ఏండ్లపూర్వము లభించెను. అప్పటిపఱకు నీకల్పనయే యుండెను. వస్త్రాపహరణసమయమున ద్రౌపది శ్రీకృష్ణుని గూర్చి మొఱపెట్టియుండెను అందునామె యాతనిని 'గోపీజనప్రియ' అను పేరితో సంబోధించెను ఈనామమునకు అతఁడు దీనులైనయబలల దుఃఖమును హరించువాఁడనియే యభిప్రాయమనుట స్పష్టమైయున్నది. ఆ నామములో నింద్యమగు నర్థమున్నయెడల సాధ్వియైన ద్రౌపది తనపాతివ్రత్యమును బరీక్షించునట్టి సమయమున నతనిని స్మరింపకయేయుండును; స్మరించునప్పటికిని ఆమె ముఖముతో నెన్నఁడును బ్రకటముచేయకుండును; ప్రకటించునప్పటికిని అతఁడామెకు నుపయోగించువాఁడే కానేరఁడు. కనుక ఈ నామమున గోపికలయొక్క విషయాతీతమగు భగవత్ప్రేమమే గర్భితమైయున్నదనుట నిర్వివాదమైయున్నదీ రెండవది, రాజసూయ యజ్ఞమునందు నర్ఘ్యమునుగైకొనునట్టి ప్రసంగమున శిశుపాలుఁడు శ్రీకృష్ణుని బూర్ణముగా నిందించెను; కాని యచ్చట నతఁడీయాక్షేపము నెత్తలేదు. మూఁడవది, శ్రీకృష్ణుఁడు బాల్యమునుండియు మల్లవిద్యను బ్రేమించుచుండుట ప్రసిద్ధమైయున్నది. మల్లయుద్ధమునకై కంసుఁడతనిని మధురకుఁ బిలిపించియుండెను. ఇటువంటి బాలమల్లునికిఁ గామవ్యసనమెన్నఁడు నుండఁజాలదనుట యఖండనీయమైన సిద్ధాంతమైయున్నది. ఈశ్వరకల్పన చేసిన మీఁదట నిచ్చవచ్చినట్టికల్పనమైనను గాఁగలదు; కాని శ్రీకృష్ణుఁడు తనయవతారమందు మనుష్యకృత్యములనే చేసి చూపియున్నాఁడు. అతఁడీశ్వరత్వమునకు సంబంధించిన సామర్థ్యమునుపయోగింపలేదు ఎచ్చనయినను దానినుపయోగించినను నింద్యకార్యమునందెన్నడును నిస్సందేహముగా నుపయోగింపలేదు. అన్నిదృష్టులచేతను విచారింపఁగా నీదోషము సత్యముకాదనియే

చెప్పవలసియుండునని సారాంశము. వర్తమాన మహాభారతముయొక్క కాలమువఱకు, గోపికలు శ్రీకృష్ణునియెడఁ గేవలము నిర్విషయమైన ప్రేమమును జూపు పరమభక్తురాండ్రై యుండిరనియే దృఢనిశ్చయముండెను. కాని మెల్ల మెల్లగా భక్తిమార్గమందు భక్తియొక్క మీమాంసయగునపుడు, భక్తికి అసతికి జారునియెడఁగల ప్రేమయొక్క సాదృశ్యమీయఁబడియుననుట సంభవమైయున్నది; "యథాస్త్రీణాం తథావాచాం సాధుత్వే దుర్జనో జనః" అని భవభూతిచెప్పినట్లుగా స్త్రీలసంబంధమున నీకల్పన ప్రచలితమైయుండును; మరియు జగత్తునందు భ్రమపూర్ణమైన విచారముత్పన్నమగుటవలన నెల్లపుడు నీప్రకారముగనే యగునట్లుచేయును. శ్రీకృష్ణునిమతము ప్రవృత్తికనుకూలమైయున్నది, దీనిఁబట్టి యీప్రవాదమునకుఁ బుష్టిలభించియుండును రాసక్రీడలయొక్క వర్ణనముచేత నవి యధికముగా వర్ధిల్లియుండును. ఈ విధముగా నీప్రవాదము తరువాత నుత్పన్నమై కాలగతిచేత, క్రీస్తుశకము 9వ శతాబ్దియందుఁ బ్రసిద్ధమైన భాగతగ్రంథమునుండి యీ ప్రసంగమును వెడలించి బహిష్కరించుట యసంభవమౌనంతగా వర్ధిల్లెను. ఈయద్వైయమైన వేదాంతగ్రంథము దానినొకవిధమునఁ దనరమ్యమైన కవిత్వముచేత జరామరణశూన్యముగాఁ జేసివైచెను; కాని రెండవవిధమున దానిని వేదాంతములో జుట్టఁబెట్టి మనము శ్రీకృష్ణగోపికాలీలలయొక్క వేలకొలఁదిగీతములను వినుచున్నప్పటికిని మనమనస్సునందు శ్రీకృష్ణునిగూర్చి నింద్యమగుభావన లేశమాత్రముకూడఁ బుట్టనంత పవిత్రముగాఁ జేసియుంచియున్నది. భగవానుఁడే ప్రవాదమునకు నాశ్రయమిచ్చి దానిని బవిత్రముచేసివైచుటచేత శృంగారప్రియులయిన నవీనకవులు విశేషించి జయదేవుఁడు తనగీత గోవిందమునను తదితరకవులు వ్రజభాషయందు వేలకొలఁది సుందరములయిన పద్యములందును దాని నలుదిక్కుల వ్యాపింపఁజేసి లోకప్రియమునుగాఁ జేసిరి. ఈవిషయమై యధికముచెప్పనేల, దీనివలనఁ బ్రాకృతశృంగారమందు నొక ప్రశస్తమగు మర్యాద యుత్పన్నమైనట్లు కనిపించుచున్నది. ఆకారణముచేత, శృంగారమును వర్ణింపవలయునేని గోపికాకృష్ణులదే వర్ణింపవలయునను నిట్లు కవిసంప్రదాయము కన్పడుచున్నది. అగుఁగాక, ఆలోచించినచో భాగవతము ఈ యాక్షేపమును నింద్యత్వమును వెడలఁబుచ్చియున్నది, యునను ఐ హాసి దృష్టిచేత దాని సత్యాసత్యత్వములనింకను విచారించుట యావశ్యకమైయుండెను, ఈ విచారముచేత నీప్రవాదము నిరాధారమనియే చెప్పవలసియుండును.

## శ్రీకృష్ణునియొక్క కపట పూర్ణమైన యాచరణము

ఇపుడు మనము కపట విషయకమైన రెండవ యాక్షేపముపైని విచారింతము. ఈ యాక్షేపమునకు బీజము మహాభారత మందున్నదనుట సత్యము. కాని యీ కల్పన భారతమందు లేదు. అది భారతీయ కథయొక్క భ్రమపూర్ణమైన దృఢనిశ్చయముచేతఁ బిమ్మట బయలుదేఱియున్నది. భారతమందు, శ్రీకృష్ణుఁడు భీష్మ ద్రోణాదులను బాండవులచేతఁ గపటయుద్ధ మార్గమునఁ జంపించెనను వర్ణనము కలదు. పాఠకుల మనస్సునందీ యాక్షేపము, వారి ధ్యానమునకు నీ ప్రసంగముయొక్క యపవాదము రాకుండుటచేతఁ బుట్టుచున్నది. సాధారణ కవుల యత్యుక్తినిబట్టి లోకులు శ్రీకృష్ణునియొక్క నీతిని బైపైగా విచారించి పాశ్చాత్యదేశ ప్రసిద్ధుడైన మేకియావేలీయొక్కయే నీతిగా నూహించుచున్నారు. కాని వారిట్లూహించుట భ్రాంతిగాఁ బొరపాటై యున్నది. శ్రీకృష్ణునికి నీతి, ధర్మము రెంటి విషయుమై పూర్ణమైన యభిమానముండెను. అతఁడు ధర్మమును లేక కునీతిని నెన్నఁడు నుపదేశింపలేదు. తానుగూడ వీనినెన్నడు నాచరింపలేదు. అవును, విశేషమైన యపవాదక ప్రసంగములయందు ధర్మముయొక్క భ్రాంతకల్పనవల్ల నుత్పన్నమైన ప్రమాదము నతఁడు నిషేధించి యున్నాఁడు. ఇట్టి స్థానమున ధర్మాధర్మములను నిశ్చయించుట బుద్ధిమంతులకుఁ గూడఁ గఠినముగాఁ దోఁచుచున్నది. ఇటువంటి యపవాదక ప్రసంగములు శ్రీకృష్ణుని చరిత్రమందనేకములున్నవి. ఆ సమయమున నాతఁడు తన యాచరణముచేతను నుపదేశముచేతను, నిట్టి ప్రసంగములందు మనుష్యుఁడెట్లాచరింప వలయునో చూపియున్నాఁడు. ఈ సంగతి నధికముగా మనము ముందు స్పష్టము చేయఁగలము.

## సామాన్యనీతి కపవాదకమైన ప్రసంగము

అహింస, సత్యము, అస్తేయము మున్నగు నీతులును ధర్మముయొక్క పరమ తత్త్వములును లోకులందఱకు సమానముగా మాన్యములై యున్నవి. హిందూధర్మమందుఁగాని, క్రీస్తు మతావలంబుల ధర్మమందుఁగాని, బౌద్ధ ధర్మమందుఁగాని, మహమ్మదీయ ధర్మమందుఁగాని యన్నింటను నీ యాజ్ఞల

ప్రమాణములై యున్నవి. ఈ యాదేశములనే ప్రపంచములోని విద్వాంసు లందఱును స్థాపించియున్నారు. కాని యీ సర్వమాన్యములైన తత్త్వము లకుఁ గొన్ని యపవాదక ప్రసంగములున్నవా? లేవా? ఉదాహరణార్థము, ఎవఁడైన నాతతాయి యధర్మముగా మనలఁ జంపుటకు వచ్చునేని మనమాతని జంపుదమా లేక యాతనిచేతిలో మనము చత్తుమా? అహింసామతము నెక్కువ యధికముగా వర్ణించు పద్ధతిలోనివాడు మనమే చావవలయుననియే చెప్పును; మనము చచ్చినను లేక వాఁడు చంపఁబడినను, హింస జరుగనే జరుగును. ఆతతాయిని జంపుటయే యుత్తమమై యున్నది. ఎందుకనఁగా, ఆతతాయి యొక్కచేతిలోఁ జచ్చుటయందు హింసయగుచునే యున్నది. మఱియు నధర్మమునకు నుత్తేజనముకూడ లభించుచున్నది, కాఁబట్టి ధర్మశాస్త్ర మహింసా ధర్మమునకపవాదమును "ఆతతాయిన మాయాంతం హన్యాదే వావిచారయన్" అని చెప్పియున్నది ఇండియన్ పీనల్ కోడునందు హత్యకునున్న యపవాదములన్నియు ధర్మశాస్త్రము ననుసరించియే యున్నవి. సారాంశమే మనఁగా, అహింస, సత్యవచనము, అస్తేయము మొదలైన ధర్మములకుఁ గొన్ని యపవాదక ప్రసంగములున్నవి. ఆ ప్రసంగములయందు నీ ధర్మములను త్యజించుట నింద్యము కానేరదు. ద్రోణునివధ ప్రసంగమునే యుదాహరణముగాఁ దీసికొనుఁడు. అస్త్రములెఱుగనివారిని ద్రోణుఁడధర్మముగా నస్త్రములచేత హింసించుచుండెను అధర్మముచేతనే పాంచాలసైన్యము ధ్వంసమై యుండెను. ఈప్రసంగమందు శ్రీకృష్ణుఁడు ద్రోణుని గపటముగాఁ జంపవల యునని ఆలోచనచెప్పి అశ్వత్థామ మరణించెనను నసత్యపుగాలికబురును వ్యాపింపఁజేసి వృద్ధునిహస్తమును బంధింపఁజేసెను. ఈసమయమున శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో, అయిదుప్రసంగములయందు నసత్యమాడుట పాప మునుగాదు బుణ్యమునుగాదని చెప్పియున్నాఁడు. నీతినిగాని కర్మమును గాని విచారించువాఁడు పైనిజెప్పఁబడినసంగతి నావశ్యము మన్నించుటలో సందేహములేదు.

## ఒక యైతిహాసికోదాహరణము.

ఇచట సాదృశ్యమునకై ద్రోణవధమునకు సమాధానమగునొక మనో రంజక వృత్తాంతమును మనమితిహాసమునుండి కైకొనుచున్నాము. పదునెని మిదవ శతాబ్దముయందు నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యుద్ధమారంభ మైనపుడు బ్రిటిషు శూరుఁడును సేనానాయకుఁడునగు జనరల్ బుల్ఫు క్వేబెకు

నందలి యుద్ధములో గెలిచి కనేడా ప్రాంతమును దనవశము చేసికొనెను. ఈ యుద్ధసమయమునకు క్వీబెకు ఫ్రెంచివారి యధీనమైయుండెను, ఆపట్టణమునకు వెలుపలవారిసేన యుద్ధము చేయుచుండెను. వారియొక్క బ్రిటిషువారి సేనలకు నడుమనొక గొప్పనది ప్రవహించుచుండెను, ఇందుచేత బ్రిటిషుసేన ఫ్రెంచివారిపై దాడి సలుపజాలకుండెను. ఆసమయమున జనరల్ ఉల్ఫ్ ఒక యుపాయముచేసెను. అతఁడు తనసేనను రెండుభాగములుగాఁ జేసి యందొక భాగమును ఫ్రెంచివారియెదుటనే యుంచి రెండవభాగమును రాత్రి యంధకారములో నావలమీఁద నదిదాఁటించి రెండవపైపునకుఁ బంపెను. అచట నదియొడ్డుఉండుటచేత ఫ్రెంచివారికి శత్రువొకవేళ నీమార్గముచేత దండెత్తునేమోయని భయముండెను అందుచేత వారి పటాలమొకటి యచటకుఁబోయి కూడ నుండెను. బ్రిటిషుసిపాయి గుట్టపైకెక్కి పైకివచ్చునంతలోనె మరి సిపాయిని పరాసీపహరాదారుఁడు నీవె ? అని యడిగెను. ఆసైనికుఁడు ఒకతెలివిగల ఐలండుదేశస్థుఁడై యుండెను. అతఁడు వెంటనే జవాబిచ్చెను. లా ఫ్రాన్సు, ఫ్రెంచివారి సైనికుఁడను. పహరావేయువాఁడు మరలనడిగెను నీవేరెజిమెంటులోని వాఁడవు? ఐలండువాఁడు మిక్కిలి వాక్చాతుర్యముగల వాఁడును భయములేనివాఁడునైన మనుష్యుఁడై యుండెను. అతఁడు నిర్భయముగా సమాధా మిచ్చెను– "డీ గారీన్"–క్వీన్‌రెజిమెంటని వానినిర్భయమైన యీ యుత్తరమును విని పహరావారుఁడూరకుండెను. తరువాతఁ బద్దెదుగురు ఇంగ్లీషుసైనికులాటంకము భయమునులేకుండఁ బైకెక్కివచ్చిరి. ఎక్కుచునే వారు ముందుగా నాపహరాదారుని తరువాతనతని వెంటనున్నసైనికులను సంహరించిరి. జనరల్ ఉల్ఫుయొక్క సైన్యమంతయు సులభముగనే నేర్పుతోఁ బైకెక్కి నదియావలివడ్డునకువచ్చి క్వీబెక్కుదగ్గర ఫ్రెంచిసేనయొక్క వెనుకటిభాగమున దండెత్తి దానినోడించెను. ఈయుద్ధములోజనరల్ ఉల్ఫ్ చంపఁబడెను; కాని యుద్ధవిజయవార్త చెవినిబడునంతవఱకు నతఁడు ప్రాణములవిడిచిపెట్టలేదు. ఆ ఐలండు దేశీయుఁడబద్ధమాడి పహరావేయువాని ప్రాణముతీసెను అతని యాకృత్యముని నింద్యమా లేక ప్రశంసనీయమా ? యనుసంగతి యిచ్చట విచారణీయమైన యున్నది. cevery thinq is faier in war న్యాయముచేతనయ్యెది ప్రశంసనీయమే యైయున్నది. హానివాలు వృషముల శృంగములయందుఁ గాగడాలను గట్టి రోమనుప్రజలను

మోసముచేసెను యూరోపీయ మహాయుద్ధముయొక్క యితిహాసమందుం గూడ, శత్రుసేనను మోసగించెను యూరోపుమహాయుద్ధములోగూడ అట్టి యుదాహరణములు వందలకొలది దొరకంగలవు. వానిలో ఈవిధముగా శత్రు సేనను మోసగించి జయముపొందబడెను. కాని దీనివల్లంగూడ విశేషన్యాయ మీవిషయమున వెంబడించు పద్ధతి సంభవమె, అహాలండు దేశస్థుడు సత్యము చెప్పనేని జనరలు బుల్ఫుయొక్క సమస్తసేనయు నష్టమైపోయెడిదె. ఈ దృష్టిచేతనతండు అసత్యమాడుట క్షంతవ్యమె. జనరలుబుల్ఫుకు సమానముగా ఆసమయమునం బాండవులు దండెత్తుటకు వెళ్ళుటలేదు. లేక ఫ్రెంచివారు బ్రిటిషువారిలో నధర్మముగా యుద్ధముచేయుటలేమ. దీనికివిరుద్ధముగా ద్రోణుడు పాండవులమీద దండెత్తి అధర్మముగావారిని సంపూర్ణముగా నాశము చేయుచుండెను. కనుక ఆసమయమున శ్రీకృష్ణుడు ధర్మరాజునకు అసత్య మాడుటకై సమ్మతియిచ్చుట సర్వథా క్షంతవ్యమైనదనియే యిచట నీతి శాస్త్రవేత్తలు తీర్పుచెప్పవలసియుండును.

### సద్గుణముల యతిరేకముకూడ దోషయుక్తమగుచున్నది.

ఈవిషయమైన విచారము యింకొకదృష్టిచేం జేయంబడంగలదు. ఏవిష యములైనను అతిరేకముగాంజేయుట దుష్టమగుచున్నది. ఆయతిరేకము సద్గుణముదేయైనను సరియే. పాశ్చాత్యులసామెతయొకటి కలదు– True virtrue lies in the mean be lween twotxtremes. దాతృత్వమును జాలి తన పసిపిల్లకాయలను దిండిలేకుండ మలమల మాడ్చుట నీతిదృష్టిచేత దుర్గు ణమేయైయున్నది. స్త్రీపై శస్త్రము నుపయోగింపంగూడదను నుదాత్త కల్పన మంచిదియే; కాని యాతతాయినియు సర్వజగత్సంతాపకారిణియునగు స్త్రీనిజంపుట తక్క మఱియొకగతి లేనియపుడు దానిపై శస్త్రము నుపయోగింప వలసినదే. ఈన్యాయమునుబట్టి రామచంద్రుండు తాటకను జంపియుండెను శిఖండిమీంద నేను శస్త్రమునుపయోగింపనని భీష్ముండు ప్రతినపట్టియుండెను. ఇదియతియే యనిపించుకొనును. ఈయున్మత్తతవలన శత్రుపక్షమేదేని లాభ మునుబోంగొట్టుకొనసిద్ధముగానున్న యెడల ననుచితముకానేరదు.ద్వంద్వయుద్ధ మందుమాత్రము ఒకమనుష్యునిపై ననేకులు దాడి సలుపరాదను నియమము

చెల్లఁగలదు; కాని ఈసందర్భములయం దేనియమము పనిచేయజాలదు. ఇట్లుకాదేని సంఖ్యాబలమునుబట్టి శత్రువులఁజంపుట యెప్పుడును న్యాయము కాకుండును. కౌరవుల పక్షమునఁ బదునొకండక్షౌహిణులు సేనలుండెను పాండవులపక్షముననేడక్షౌహిణులే. దీనినధర్మముగాఁ దలఁచఁదగదా ? సారాంశమేమనఁగా, భీష్ముని వధప్రసంగమున నధర్మమాభాసించుచున్నది; అయినను వాస్తవమున నది యధర్మముకాదని చెప్పవలసియుండును. అన్నివిధములను సూక్ష్మముగా విచారించునెడల శ్రీకృష్ణుఁడుపాండవులచేఁ గొంచెమైన ననుచితము చేయింపలేదని తెలియఁగలదు. ఉచ్చనీతియొక్క దృష్టినిబట్టి, అక్కడ నధర్మముయొక్క కేవలాభాస మున్నను అపవాదక ప్రసంగమునందు సర్వస్వఘాతాది కారణములచేత నధర్మావలంబముకూడ క్షంతవ్యమైనట్లు కనిపించుచున్నది. కాని యుద్ధమును సర్వస్వనాశాదికారణములనువిడిచి ప్రసంగాంతరములయందు నధర్మమునవలంబించుట యెన్నఁడునున్యాయము కాదని జ్ఞప్తి యుంచుకొనవలయును. ఈ మర్యాదనాదరింపకపోవుటచేత శ్రీకృష్ణుని విషయమై భ్రాంతిచేత శ్రీకృష్ణుఁడొక కపటవ్యక్తియైనట్లు తోఁచుచున్నది. కాని వాస్తవముగా విచారించినచో అహింస, సత్యము, అస్తేయము లోనగు పరమధర్మములకు ధర్మశాస్త్రము మన్వాదిస్మృతులు నపవాదములను పుట్టుకొనియున్నది ఇట్టియపవాదక ప్రసంగములయందే శ్రీకృష్ణుఁడు కూటయుద్ధము నవలంబించుటకై యాలోచనచెప్పియున్నాఁడు. అతఁడిట్టిసమ్మతిని మఱియెచటను నిచ్చియుండలేదని జ్ఞప్తియుంచుకొనవలయును.

## శ్రీకృష్ణుని దివ్యోపదేశము.

సూక్ష్మపరిశీలనమునెడు కొలిమియందు బుద్ధిపొరపాటువలనఁజేయఁబడిన యాక్షేపములన్నియు భస్మమైన తరువాత శ్రీకృష్ణుని రమ్యచరిత్రము మేలిబంగారమువలెఁ దేజస్వియు నుజ్జ్వలమునై కనిపించుచున్నది, కాని యతియుక్తిచేతను లేక పొరపాటుచేతను అతనిచరిత్రలోఁ గొన్నిసంగతులెంతయు విపర్యస్తములయినప్పటికిని నాతని యుదాత్తాభిప్రాయములకు నిధియైన దివ్యమగు భగవద్గీత ప్రపంచమునున్నంతవఱకు శ్రీకృష్ణుని చరిత్రము ప్రకాశింపకుండ నెన్నఁడును నుండదు. ఈపరమతత్త్వజ్ఞానమునందు శ్రీకృష్ణుఁడు

చేసిన కర్మయోగోపదేశము సర్వకాలములయందును సర్వదేశములందును నిఖిలలోకాదరపాత్రమై సమస్తమై యుండగలదు. కర్మము సిద్ధించునో లేదో యను ఈవిచారముచేత మనస్సును జలింపనీక తనకర్తవ్యకర్మమును, నేను పరమేశ్వరునిపై భారమునైచి పరమేశ్వరేచ్ఛచేత దానినిజేయుచున్నాను దానిని పరమేశ్వరునికే యర్పణముచేయుచున్నాను అను భావనతో జేయు వలయును. ఈసిద్ధాంత మత్యంతోదాత్తమైయున్నది. ఇంతటియుదాత్త కర్తవ్యసిద్ధాంతమును నేటివఱకు నేతత్త్వవేత్తయు బోధింపలేదు. ఈ సిద్ధాంతమేవని చిత్తమున స్థిరమై యుపయోగించుచున్నదో యతడు నిశ్చయముగా దుఃఖసాగరమును దరింపకుండ నుండడు. కర్మము ద్యజించుట యశక్యమన్న సంగతిని శ్రీకృష్ణుడు ప్రపంచదృష్టికి జక్కగా జూపికొని వచ్చెను. ధర్మమును నీతి నన్నుసరించి జగత్తునందలి భౌతికసుఖములను నియమయుక్తముగా నుపయోగించుట అనగా సదాచరణయుక్తమైన గార్హస్థ్యము సంన్యాసమువలెనే పుణ్యప్రదమైనదని యుభిప్రాయమును స్పష్టముగా నతడిచ్చెను. ఇదియే దైవసంపత్తియై యున్నది దైవసంపత్తి మోక్షమును గలుగజేయుచున్నది. మహాభారతమునందు వ్యాసుడిట్లు చెప్పియున్నాడు. ఇంద్రియములను పూర్తిగా నిరోధించుట మృత్యువుకంటెను నధికదుఃఖదాయకమని. రెండవపక్షమున ఇంద్రియములను స్వేచ్ఛగా వదలినచో దేవతలకు గూడ నధోగతి తప్పదు. సంక్షేపముగా శ్రీకృష్ణుడు, మనుష్యుడు నీతిశాస్త్రి ముచే యుక్తమైన ఆహారము విహారము లవ్వాడై యుండి యుత్సాహముతో నుత్థానమునవలంబించి, తనకర్తవ్యకర్మమును జేయుట యుచితమై యున్నదని యుపదేశించియున్నాడు. ధర్మవిషయమునగూడ శ్రీకృష్ణుడు మనుష్యుడు న్యాయముగను సుచిత్తముగను నుండవలయునని యుపదేశించియున్నాడు. సంసారమునిడిచి యరణ్యమునకుబోయి నివసించుట సంన్యాసముకానేరదు; కాని కామ్యకర్మముల సంన్యాసమే సత్యమైన సంన్యాసము. కర్మమును పూర్తిగా విడిచిపెట్టుట త్యాగమనిపించుకొనదు; ఇకనేమంటేని కర్మఫలాసక్తిని ద్యజించుటయే సత్యమైన త్యాగము. శరీరమునందలి భూతగ్రామమును బలాత్కారముగా నాకర్షించి యాత్మనన్నివిధముల గష్టపెట్టుటయే తపస్సుకాదు; ఇకనేమంటేని యోగ్యనియమ యుక్తమైన గురుశుశ్రూషాదికమే శారీరకమైన తపస్సు, సత్యభాషణాదులచే వాచికమైన తపస్సు, ప్రసాదము, శాంతిమొదలయినవానిచే మానసికమైన తపస్సుమరి యొకటి తపస్సు కానేరదని యతడు ప్రతిపాదించి యున్నాడు. ఈశ్వర సిద్ధాంతము అనగా బ్రహ్మజ్ఞానము విషయమై యతడుసంన్యాసమున వ్యక్త

మునైన బ్రహ్మమునకు విరోధముగా శిష్టులదుఃఖమును హరించు వానిని దుష్టులను దండించువాని నీశ్వరుని యవతారముగా లేక సుగుణ బ్రహ్మముగాఁ బ్రతిపాదించియున్నాఁడు. పరమేశ్వరుఁడు కేవలము భక్తిచేతనే సాధ్యుఁడై యున్నాఁడు. భక్తిమార్గముయొక్క ద్వారములందఱకును నాటంకములేనిదియు సులభమైయున్నవి; అంతియేకాక చాండాలుఁడు, బ్రాహ్మణుఁడు, స్త్రీయుఁ బురుషుఁడు నీశ్వరభక్తిచేత సమానముగా మోక్షమును బొందగలరు. శ్రీకృష్ణుఁడిట్లుదారము నుదాత్తమునయిన మతమును నిర్భయముగా జగత్తునకు నెదుటనుంచియున్నాఁడు తత్త్వజ్ఞానమువిషయమై యతఁడు సాంఖ్యమునకు యోగమునకును, కర్మమునకు వేదాంతమందును విరోధమును దొలగించి తన నవీనమైన భక్తిమార్గముతో వానినన్నింటిని సమన్వయించెను అందఱను దనయుచ్చతత్త్వమున కనుయాయులనుగాఁ జేసియున్నాఁడు. రాజనీతి విషయమై యతఁడు నిరపేక్షస్వార్థత్యాగమున కుదాహరణమును జగత్తునకుఁ జూపియున్నాఁడు. కంస జరాసంధుల నాశమును స్వార్థమునకయి నాశము చేయలేదు. మరియు దానివల్ల తనకుకొంచెముగూడ లాభమునుగూర్చు కొనలేదు. భారతయుద్ధమునందుఁగూడ పాండవపక్షము సత్యమైనదని తెలిసి కొనియే వారికి సాయముచేసెను. దుర్యోధనుడు పాండవులకు అధర్మముగానే రాజ్యమివ్వలేదు. అందుకే వారు హీనబలులయినను మండవపక్షమును స్వీకరించి అర్జునునకు సారథ్యముచేయ నంగీకరించెను అన్నిటికంటె ముఖ్యమైనసంగతియేమనఁ శ్రీకృష్ణుడు ఆర్యులను అనార్యులను సమానప్రేమము రక్షించి యందఱకు నీశ్వరభక్తికి నాటంకములేని సులభమార్గమును జూపెను. ఆలోచింపఁగా నేఁడు హిందుస్థానమందు భిన్నభిన్నములైన వర్ణములు తమ తమ యాచారవిచారములచేత విభక్తములయి కనిపించుచున్నవి. అయినను శ్రీకృష్ణుని భజించుట యందును అన్నిజాతులలోని యన్నిమతములలో ఆబాలవృద్ధము హిందూప్రజలు ఒండొరులు భేదభావమునుమఱచి యొకమెట్టు మీఁదనే నిలఁబడి భగవద్భజనమందు లీనులగుచున్నారు. మరియు మనమందఱము-జాతినిరపేక్షముగా - మోక్షపదమును బొందఁగలమని విశ్వసించుచున్నారము స్వభావముగనే వేలకొలదియేండ్లనుండి నేటివరకుక్రిందివారినుంపై వారివరకు అజ్ఞానులు విజ్ఞానులు హిందువులందరు శ్రీకృష్ణుని సమానముగా భక్తితో ప్రేమతోఁ బూజించుచు వచ్చుచున్నారు. ముందుగూడ భగవద్గీత యొక్క దివ్యోపదేశమునకు మోహితులై దానిని ఈవిధముగనే పూజింపఁ జేయుచునుండఁగలరు.

సమాప్తము

– ౦ –